


సంపుట : ౮.  విక్రమ, కార్తీకము : నవంబరు, 1940.  సంచిక : ౨

# ముత్తమ్మ

'ప్రియుఁడు పరలోకగతుఁడైన పిదప సతుల
కనుగమన మెందు నర్హాకృత్యంబు దగిన
తెఱఁగు గావింపఁబనుపుము తీర్చికొనద
నగ్నిముఖమునఁ బతి నియోగాగ్నియంత.'

—జైమిని భారతము.

భారతసతీత్వమును బ్రహ్మాండముగఁ బ్రపంచమునకుఁ జాటు ప్రాక్తనాచారములలో సహగమన మొకటి. ఈ అనుగమనాచార ముత్తరహిందూస్థానముననే- అందును రాజపుత్రస్థానముననే- విశేషముగ విస్తరించియుండినదని పలువురి యభిప్రాయము.

కాని నిజ మట్టిదికాదు. రసపుత్రభూమిలో సహగమనాచార మెంతగ విస్తరిల్లియుండినదో ఆంధ్రభూమిలోఁగూడ నది యంతగనే విస్తరిల్లియుండినది: రసపుత్రరమణు లెంతటి నిశ్చింతభావముతో, నిర్భయచిత్తముతో సహమరణాచారమును బాటించియుండిరో ఆంధ్రరమణులును అంతటి నిశ్చింతభావముతోడనే, నిర్భయచిత్తముతోడనే ననుమరణాచారమును బాటించి యుండిరి.

ఆంధ్రులదైన విజయనగర సామ్రాజ్యముననేమి; ఆ విజయనగర సామ్రాజ్యశాఖలైన మధుర, తంజాపురనాయకరాజ్యములందేమి సహగమనాచారము విశేషముగఁ బ్రబలియుండెను.

చితాకాష్ఠోద్దీపితములగు వహ్నులతో ఆరాజ్యములు పలుతడవలు ప్రకాశమానములైనవి. అనలముఖమున నిమిషవేదనకు నోర్చి పతితోడిద లోకమని ఏగిన ఎలనాగల నెందఱనో ఆరాజ్యములఁ జరిత్రలు పేర్కొనుచున్నవి.

అట్లు పేర్కొనఁబడినఁ బేరఁటాండ్రలో మన ప్రస్తుతకథకు నాయకురాలైన ముత్తమ్మ యొకతె.

అయితే ఆమె మరణించినఁ బతితో చితాగ్నిశిఖాముఖమున శరీరమును వ్రేల్చినఁ జిరంటికాదు. ఆమె సహగమనముచేసిన పరిస్థితియు, పద్ధతియు నపూర్వములైనవి; అశ్రుతపూర్వములైనవి.

ముత్తమ్మ నామము మన కీవఱకే పరిచితమై యున్నది. ఆమె మధురనాయకరాజ్య పాలకుఁడైన రంగకృష్ణముద్దువీరప్పనాయకుని అర్ధాంగలక్ష్మి; ఆంధ్రరమణీమణులలో నొకతెయైన మంగమ్మకుఁ (1940 జనవరి సంచిక) గోడలు.

ఈసంగతులు మన కింతకు ముందే ఎఱుకపడియున్నవి. ౧౬౯౨-వ సంవత్సరమున ముద్దువీరప్పనాయఁడు స్ఫోటకమువలన మరణించుటయు, నప్పటికి అతని భార్య ముత్తమ్మ నెలలునిండిన చూలాలై యుండుటయు, నాకారణమున నామె యప్పటికి మంగమ్మ ప్రోద్బలమువలన సహగమనోద్యోగమును విరమింపవలసివచ్చుటయుఁ, బ్రసవానంతర మామె సహగమనమొనర్చుటయు మంగమ్మ జీవితకథలోఁ బ్రస్తావింపఁబడియున్నవి.

అక్కడ ఆప్రస్తావన సూచీమాత్రముగ నున్నది. ముత్తమ్మ చరిత్ర అట్లు సూచీమాత్రముగఁ జెప్పి వదలివేయఁ దగినది కాదు. అది ప్రత్యేకము ప్రస్తరింపఁదగిన పరువము, ప్రాముఖ్యముగలది.

కావున నామెకథ విపులముగ వివరింపఁబడుచున్నది. వినుఁడు :

మధుర ఆంధ్రనాయకరాజులు ప్రాయకముగ బహుభార్యాలోలురై యుండిరి. ముత్తమ్మ పెనిమిటియైన రంగకృష్ణముద్దువీరప్పనాయఁ డట్లుగాక ఎన్నదగిన ఏకపత్నీవ్రతుఁడై యుండెను.

ముత్తమ్మపట్ల ముద్దువీరప్పనాయనికిఁ బ్రాణాధికప్రేమ. ముద్దువీరప్పనాయనిపట్ల ముత్తమ్మకు నంతే. పుష్పమునకు వాసనవలె నవినాభావ సంబంధమున ముద్దువీరప్పకు ముత్తమ్మ సహధర్మచారిణియై సారమైన సంసారసుఖ మనుభవించుచుండెను.

రాగమయము, శృంగారమయమునైన వారి దాంపత్యమునకుఁ బ్రత్యక్షఫలమును బ్రసవించుటకు ముత్తమ్మ తొలిసారి గర్భవతి యయ్యెను. నెలలు ఆఱు, ఏడు అతిక్రమింపగా నామెకు వేఁకటిభార మతిశయించుచుండెను.

ఇంతలో ముత్తువీరప్పకు స్ఫోటకము సోఁకెను. ఆ వికృత రోగమునుండి అతనికి విముక్తి లేకపోయినది. అతఁడా వ్యాధివలన ౧౬౮౯-వ సంవత్సరమున మరణించినాఁడు.

జీవితేశ్వరుని అస్తమయముతో ముత్తమ్మ కొక్కసారిగా మిన్నువిఱిగి మీఁదఁబడినట్లయ్యెను. అప్పటున నామెకు రెండవయాలోచనతోచలేదు. పతితో ననుమరణము పొంది తీరవలెనని ఆమె నిశ్చయించెను.

స్ఫోటకమువలన మరణించిన వారిని ఖననముచేయుటయే కాని దహనముచేయరు. కాఁగా నామెకుఁ బతితోడఁ జితారూఢయై యగ్నిశిఖల నపగతప్రాణయగుటకు వీలులేదు.

అంతమాత్రమున నామె సహగమనోద్యోగమును విరమింపలేదు. ఖననసంస్కారమే కాని దహనసంస్కారములేని బసవమతస్థులు విజయనగరసామ్రాజ్యమునఁ బతితో నాతనిపత్నిని గూడ ఖననముచేయుట అనుమరణపద్ధతిగ నేర్పఱచియుండిరి.

తన అప్పటిస్థితిలో ఆపద్ధతి నవలంబించుటకు ముత్తమ్మ కృతనిశ్చయ యయ్యెను.

సహమరణపద్ధతిని గురించి నిశ్చయమైనది. ఇఁక నామె అత్తయగు మంగమ్మ యనుమతిని బడయవలసియున్నది.

తనభర్త చొక్కనాధనాయఁడు మరణించినప్పుడు అతనితో ననుమరణమునొందక ఆచారమును మీరియున్న మంగమ్మ కోడలిని– నెలలునిండిన చూలాలిని,– రాజ్యమునకు వారసుని ప్రసవించగల రమణిని–సహగమనము చేయనిచ్చునా ?

సహగమనవ్యవసాయమున నితరమగు సర్వమును విస్మరించియున్న కోడలు ముత్తమ్మను సమీపించి మంగమ్మ సానుభూతిపూర్వకముగ నిట్లు చెప్పినది.

'బిడ్డా! నీ సంకల్పమును నేను తెలిసికొంటిని. ఈసందర్భమున నా ఉపదేశమును నీవు సావధానచిత్తముతో నాలింపవలసియున్నది.

నీమామగారు చొక్కనాధనాయనివారు మరణించుసరికి నేను గర్భవతినై ఉంటిని. నీభర్తను ప్రసవించినపిమ్మట పలువత్సరములకుఁగాని నాకు తిరిగి గర్భము కలుగలేదు. ఏడమై ఎన్నోసంవత్సరములకు గర్భమువచ్చినదిగదా యని నేను అనంతసంతోషమునఁ

బొందుచుండఁగా పాపఫలమున భర్తృహీననుగావలసివచ్చినది.

గర్భవతినై యుండియు నిప్పుడు నీవలె నప్పుడు నేనును సహమరణమునకు సంసిద్ధనైతిని.

కాని పెద్దలు తఱిమిచెప్పి యప్పుడు నన్ను సహమరణోద్యోగమునుండి విరమింపఁజేసిరి. అనంతరము ప్రసవమైతిని. మగబిడ్డ పుట్టెను. కాని అక్కఱకురాలేదు.

అందుతో వంశమున కంతకు నీభర్త యొక్కఁడే అధారమైనాఁడు. ఇప్పుడు అతఁడును కఱవైనాఁడు. ప్రస్తుత మిఁక నీగర్భస్థమై యున్న శిశువే ఈవంశమున కెల్ల యాధారమైయున్నది.

ఈస్థితిలో నీవు సహగమనమొనర్తువేని మనవంశ మింతతో నిర్వంశమై పోఁగలదు. కులపాలికవు కాఁదగిన నీ విప్పుడు చితాగ్నియందు తను వెరియఁ జొఱఁబడుచో నిఁక మా కేమిదారి ?'

వాచాప్రాగల్భ్యము మెఱయ మంగమ్మ యిట్లు వచించినది. కాని ఆవాచాప్రాగల్భ్యమునకు ముత్తెమ్మ ముగ్ధురాలుకాలేదు. అల నాఁడు సహగమనముచేయక సజీవయైయున్నందుకు ముత్తెమ్మకు అత్తపట్ల కొంత అలసభావము కలదు. ఇపుడు తన సహగమనమునకు ఆమె అడ్డువచ్చుచుండుటతో అలసభావమునకుఁ ఆగ్రహము తోడైనది. అగుట ముత్తెమ్మ యిట్లు చెప్పినది :

'అత్తా ! నీవు ఆరితేరిన గుణాఢ్యవే ఐనను యోషిద్ధర్మములు నాకుఁ జెప్పనక్కఱలేదు. నేను విధవనై జన్మనొల్లను. నేను సహగమనము చేయకమానను. ఈప్సితార్థమునకు జాఱుచున్న నాహృదయరుచిని చీకాకు పఱచకుండువు గాక !'

అవంధ్యప్రతిజ్ఞయై ముత్తెమ్మ ఇట్లు పలుకఁగా మంగమ్మ విచారఖిన్నయైనది. రాజవంశము నిర్వంశమగుట కామె కెంతమాత్రమును ఇష్టములేదు. కాఁగా నామె మఱి యొకసారి కోడలికి నచ్చఁజెప్పఁ దలఁచి యిట్లు వచించినది.

'బిడ్డా ! నీవు సహగమనమును తలపెట్టినది భర్త నభ్యుద్ధరించుట కేగదా? అయితే అతనిని పున్నామనరకమునుండి కూడ నభ్యుద్ధరింపవలదా? అతనికిఁ బుత్రుని ప్రసాదింపక నీవు పంచత్వము నొందుచో నతఁడు పున్నామనరకము నెట్లుత్తరింపఁగలఁడు?'

ఈప్రశ్నము ముత్తెమ్మ నొక్కసారిగఁ గలచివైచినది. తాను ముద్దువీరప్పకు మనఃప్రియ, ధర్మపత్ని. అగుట అతనిని పున్నామనరకమునుండి యుద్ధరించుటయు నవశ్యకార్యమే. ప్రసవించిన పదపడి సహగమనముచేయుచో రెండు లాభములును ఒనగూడును.'

ఈవిధమైన ఆలోచనతో నామె ప్రతిన కొంచెము పలుచబడినది; మనస్సు కొంచెము మెత్తపడినది. అందుచే నామె మంగమ్మవైచిన ప్రశ్నకెట్టి సమాధానమునుజెప్పక నీళ్లు నమలినది.

అదను, పదను బాగుగ నెఱిఁగిన అనుభవజ్ఞురాలు మంగమ్మ అప్పుడు ముత్తెమ్మతోఁ జల్లగా నిట్లు పలికినది.

'బిడ్డా ! అనుమరణదీక్షను అసలే విడనాడమని నేను చెప్పుటలేదు. ప్రస్తుతమాపుము. ప్రసవానంతరము దానినిగుఱించి యోచించుకొనవచ్చును.'

ఆమాటలకు ముత్తెమ్మ తోడనే ఇట్లు ప్రతివచనములు పలికినది. 'ప్రసవానంతర మిఁక యోచన ఏమున్నది? అప్పుడు తప్పక సహగమనము చేయనిచ్చెదమనుచోఁ బ్రస్తుత మా ప్రయత్నము విరమించెదను. లేనిచో నిప్పుడే అనుగమనము చేయుదును.'

ప్రస్తుత మాప్రయత్న మాపగలిగినచోఁ దరువాత చూచుకొనవచ్చునని అప్పుడు మంగమ్మ ముత్తెమ్మ చెప్పినదానికెల్ల వల్లె యన్నది. అందుమీద ముత్తెమ్మ అప్పటికి సహగమనప్రయత్నమును విరమించి దినమొక యుగముగా గడుపుచు ప్రసవసమయమునకై నిరీక్షించుచుండెను.

కొద్దిదినములకు ముత్తెమ్మ ప్రసవించినది. మగబిడ్డపుట్టెను. ముత్తెమ్మయు, మంగమ్మయు వంశోద్ధారకుఁ డవతరించినందు కనంతముగ నానందించిరి.

ఆ ఆనందములో ముత్తమ్మ సహగమనప్రయత్నము నేమఱ గలదని మంగమ్మ ఆశించినది కాని యట్లు కాలేదు.

నీళ్లాడిననాఁడే ముత్తమ్మ సహగమనమునకు అత్త అనుజ్ఞను కోరినది. మంగమ్మ మఱునాఁటికి వాయిదా వేసినది. మఱునాఁడును అట్లే యయ్యెను. మూఁడవనాఁ డడుగఁగా నాలుగవనాఁటికి వాయిదా పడినది.

రేపు, రేపు శబ్దములతోఁ జీకాకు పుట్టి నాలుగవనాఁడు ముత్తమ్మ గట్టిపట్టు పట్టినది.

అప్పుడు మంగమ్మ సానునయవచనములతో నిట్లు చెప్పినది. 'బిడ్డా! కళ్లువిప్పని ఆ కసుగందును జూడుము. పురిటిరోజులైన వెళ్ళని ఆనెత్తురుకందును మాతృహీనను చేయుదువా?'

తన సంకల్పము సిద్ధింపకుండఁ జేయుటకై వేయఁబడు ఈప్రశ్నము నామె చెవినిబెట్టలేదు. 'ఈ బిడ్డను సాఁకుభార మింక నీది. నాకింక ఇహలోకచింత లేదు. ఈ నాఁడు నే నెట్లయిన సహగమనము చేసి తీరెదను' అని అవంధ్యప్రతిజ్ఞయై ముత్తమ్మ పలికినది.

పథ్యమైన పుచ్చుకొనని పచ్చిబాలెంతరాలామె. సహగమనము చేయనిచ్చుట యెట్లు? అందును సహగమనాచారము మంగమ్మ కంతగాఁ బట్టలేదు.

అగుట ముత్తమ్మ కెట్టులైన సహగమనావకాశము లేకుండ చేయవలయునని మంగమ్మ దీక్షవహించినది.

మంగమ్మ నిజహృదయ మప్పటికి ముత్తమ్మకుఁ దెలిసివచ్చినది. కాఁగా నింక నెంతమాత్రము జాగు సేయకూడదని ఆమె నిశ్చయించినది.

అయితే మంగమ్మ అజ్ఞ లేనిది తనకుఁ జితి ఎవరు పేర్చెదరు? ఆమె కేమియుఁ దోచినదికాదు. నిస్పృహనేత్రములతో నామె పురిటిగదియంతయుఁ గలయఁజూచినది. ఒకమూల మేజాపైఁ బన్నీటితో నిండిన పన్నీరుబుడ్డి యొకటి యామెకుఁ గనిపించినది.

చితాగ్నిశిఖాముఖమున శరీరము వ్రేల్చి అపగతప్రాణయగుటకుఁ దనకు వీలులేకపోవుగాక—గదియందేయుండి సాధనాంతరముతో మరణమును వరించుచో నెవ రడ్డఁగలరు?

'పన్నీరు త్రాగినచోఁ జలువఁ జేయును. నవప్రసూతలు చలువఁ జేయు వస్తువులను దరికిఁ జేరనీయరాదు. వారికిఁ బన్నీటిని త్రాగుటకైన అనుమతిలేదు. అట్టివారు పన్నీరము త్రాగుచో సూతికావాతము ప్రకోపించి వారిని చంపఁగలదు. ఇఁక సందేహింపనేల?'

పన్నీరుబుడ్డిని చూచినతరువాత ముత్తమ్మ కిట్టి తలపులు గలిగెను. కలుగుటయే తడవుగ నామె ఆ గొజ్జఁగినీటినంతయు నొకచుక్కయైన మిగులకుండ గడగడ త్రాగివైచినది.

హిమాంబువులు పానముచేసిన జాముకే ఆనాలుగురోజుల పురిటాలికిఁ జలువలుక్రమ్మినవి; కాళ్లు చేతులు చల్లబడినవి; సూతికావాతము ప్రబలి ఆమె అసువులు తీసినది.

విశాలవిశ్వమున సహగమనాచారసస్యమునకు భరతఖండ మొక్కటే కేదారక్షేత్రము. ఈక్షేత్రమునఁ బండిన సహగమనములు సంఖ్యాతీతములు. సంఖ్యాతీతములైన అట్టి సహగమనములలో ఆంధ్రరమణి ముత్తమ్మ చేసిన సహగమనమువంటి సహగమనము మఱియొకటి కానరాదు. ఇచ్ఛాపూర్వకమైన ఈ యనుమరణముతో నితరములు దొరయు పాటివి కావు.

'తండ్రివంశంబునం దేడు తరములకును
దల్లివంశంబునం దేడు తరములకును
ధవునివంశంబునం దేడు తరములకును
శాశ్వతస్వర్గ సౌఖ్యమీఁ జాలు సాధ్వి.'

—కాశీఖండము.

# ఆంధ్రసాక్షాత్కారం

"నాదుఃఖం తీరడానికి యువకులు ముఖ్యంగా మూడు పనులు చెయ్యాలి. ౧. ఆంధ్రుల ఐక్యీకరణ, ౨. ఆంధ్రభాషోద్ధారణ, 3. ఆంధ్రజాతీయతాభివృద్ధి. ఈ మూడూ నాస్వాతంత్ర్యానికీ నా సంతోషానికీ పునాదులు. ఈ కార్యాలు యువకులే నిర్వహించాలి."

రచయిత:

ఆంధ్రశ్రీ

మల్యాల వేంకటశివరామకృష్ణ

ఈమధ్య అయిదారు రోజులుగా ఒకటేకల. ప్రతీ రాత్రీగూడా అదే దృశ్యం-- నిర్మానుష్యమై చూడ భయం గొల్పుతూ అక్కడక్కడ ఒకతుప్ప, డొంక తప్ప ఏమీలేక శ్మశానవాటికను తలపిస్తోన్న పెద్దబయలు. అందు ఒక పెద్దరాతిమీద సుమారు ముప్పైసంవత్సరాలవయస్సుగల ప్రౌఢ జుట్టు విరియబోసుకుని అలంకారరహితయై శ్వేతవస్త్రధారిణియై కన్నుల సంతతబాష్పవృష్టిగా విలపిస్తోంది. నేనక్కడికెలా వెళ్లేనో, ఏపనిమీద వెళ్లేనో నాకే తెలియదు. నేను ఆమెని సమీపించి 'అమ్మా! నీ వెవ్వరివి? ఎందుకిలా విలపిస్తున్నావు?' అని అడిగేను.

ఆమె 'నాయనా! నాదుఃఖం తీర్చడానికి నీ ఒక్కడి తరమూ కాదు. నాదుఃఖం తీర్చగలిగే సమర్థులు లేకపోలేదు. కాని వారంతా నన్ను బహిష్కరించేరు. నా విషాదగాథ చాలావుంది' అని చెప్పింది.

'ఈభయంకర ప్రదేశంలో ఒంటరిగా వుండడ మెందుకు? నీ పేరెవరు? నీనివాసస్థలమేది? నీ బంధువు లెవరేనా వుంటే చెప్పు; ఈదుఃఖసమయంలో వారిదగ్గర దిగవిడిచి వస్తా! లేకపోతే నా వెంట వచ్చి నీ ఇష్టమొచ్చినంతకాలం మాయింట స్వేచ్ఛగావుండు. అంతేకాని నీ విలా ఒంటరిగా ఈప్రదేశంలో వుండడం నాకు మనస్కరించడంలేదు.'

అప్పుడామె 'అబ్బాయీ! మీరంతా నా బంధువులే! నీవు ఒంటివాడవు. నన్ను భరించి పోషించలేవు. అప్పుడే రెండు వందలేండ్లనుంచీ నేను పట్టణాలు వదిలేసి ఇలాంటి ప్రదేశాల్ని నానివాసాలుగా ఏర్పరచుకొన్నాను. బ్రతికి చెడిన దాన్ని; నాపేరు చెప్పుకోడానికి సిగ్గవుతోంది. అయినా నువ్వింతగా అడుగుతున్నావు గనక చెబుతున్నా. నేను త్రిలింగరాజ్యలక్ష్మిని! ఆంధ్రరాజుల అంకతలవర్తిని.'

ఆమె ఇట్లా అనడంతోటే నేను సంభ్రమాశ్చర్యాలతో. 'అమ్మా! క్షమింపుము. నేను మిమ్ముల నొక సామాన్యస్త్రీగా నెంచి ఏకవచన ప్రయోగం చేశేను. మీదర్శన మొదవినందుకు నాజన్మ తరించింది. తమ దర్శనం నాకబ్బడానికి కారణం తమరియందు నాకుగల భక్తిరేణువే అని నా అనుమానం. నే నిప్పుడు తమరి కష్టాలు ఊహించగలుగుతున్నాను. తమరికష్టం నేను తీర్చ నశక్తుణ్ణయినా తీర్చగలిగే సమర్థులకు పత్రికాముఖంగా విన్నవించి ఉద్బోధించగలను. వారిని వారివిధులందు హెచ్చరింపగలను! ఇదే నేను తమకు చేయగల సేవ. కనక తమరు నాయందు కటాక్షించి తమదుఃఖకారణం సెలవీయకోరెదను' అని భక్తితో ప్రణమిల్లి పలికేను.

ఆమె 'బిడ్డా! మీరందరూ నాపుత్రులు. మీరు నన్ను చనువుగా 'అమ్మా!' అని ఏకవచనంలోనే పిలుస్తే నాకెక్కువ సంతోషం. నేను రాచమర్యాదలతో గౌరవింపబడి సంభావింపబడే కాలం గతించింది. ఇంక తిరిగిరాదు. ఇక నాదుఃఖానికనేక కారణాలున్నాయి. ఒకటొకటిగా చెబుతా విను' అంది.

౧

'నా నివాసస్థలం నాలుగుచెక్కలయింది. నాడ్డల్ని నాలుగు వంపులా నా సవతుల బిడ్డలైన తమిళులొక వంపు, కన్నడులొక వంపు, ఉత్కళులొక వంపు, మహమ్మదీయులొక వంపు పట్టి పల్లారుస్తున్నారు. మహమ్మదీయుల పాలనలోనున్న (తెలంగాణా) నాబిడ్డలు ఏ సౌఖ్యము లేక పోవుటే గాక మీకున్నంతటి వాక్స్వాతంత్ర్యమైనా లేక దుర్భర జీవనం గడుపుతున్నారు. మీరైనా బొత్తిగా నోటి మెత్తదనంచేత నోరున్నవాడిదే రాజ్యమైన ఈకాలంలో తమిళులచే మొట్టికాయలు తింటున్నారు'. ఇంతలో తూర్పున అరుణరేఖలు గోచరించేయి ఎదురుగా చూతునుగదా ఆమె అదృశ్యురాలైంది.

౨

ఆ మరునాడురాత్రి తిరిగి అదే కల, అదే దృశ్యం. మాతృదేవి ప్రత్యక్షం. ఆమె నాడిలా చెప్పింది.

'నా పుత్రసంతానంలో దిగ్గజాలున్నాయి. నాబిడ్డల్ని నేను పొగడుకోగూడదుగాని వారు తలుచుకుంటే నన్ను మళ్లీ నగరవాసురాలినిగా చేయగలరు. కనకాభిషేకం కురిపించగలరు. నా పెద్దకొడుకు పట్టాభికి షష్ఠిపూర్తి సమీపించింది. కాని నాసంగతి ముదిమది దప్పిన అతని బుర్రలోంచి ఖాళీఅయిపోయింది. ఈయేడు కాంగ్రెసుశృంఖలాల్లోంచి విడిపడ్డాడు గదా! నావైపు దృష్టి మరలిస్తాడేమోనని ఆశించేను. నీబోటివారిచేత జ్ఞాపకంచేయించేను. కాని నామరూపాలేనా లేని, కాంగ్రెసు అరవ చాకిరీలో అతనికి నాదృష్టేలేదు. చేతికందివచ్చి అన్నివిధాలా ఉపయోగిస్తాడనుకొన్న పెద్దబ్బాయి ఇట్లుండగా పరానుకరణంలో మునిగిపోయిన యువకులికి నేనంటే ఏమి జ్ఞాపకముంటుంది? ఏదో నీబోటివాళ్లొకళ్లిద్దరు మనస్సుండబట్టక ఏమే నాఅంటే హేళనచేసి వెక్కిరించేవారేగాని నీమాట చెవినిబెట్టేవారెవరు? నేనంటే ఇంకా అభిమానంవున్న పుత్రులు సాంబమూర్తి, ప్రకాశంలాంటివాళ్లున్నారు. కాని వారు దృష్టి నావేపునున్నా కాంగ్రెసురొంపిలో దిగబడి నాదరి చేర జాలకున్నారు. ఇదీ నా పుత్రులస్థితి' అని చెప్పేసరికి ఆవేళ తెల్లారిపోయింది. ఆమె అంతర్థానమై పోయింది.

౩

'అమ్మా! ఇంకా నీవిచారాని కారణాలున్నాయా' అని అడిగేను మూడోరాత్రి ఆమె కనుపించగానే.

ఆమె 'లేకేమి? ఆకాశమ్మీద చుక్కల్ని లెఖ్ఖపెట్టచ్చుగాని నాకష్టాని కంతులేదు. ఈమధ్య నాపుత్రు డొకడు తమిళదేశంలోని విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడయేడు. తంజావూరులోనున్న తన ఆంధ్ర విజ్ఞానాన్ని పెంపొందింపజేస్తాడేమోనని ఉవ్విళ్లూరేను. పరదేశాల్లో నాకు కీర్తి ప్రతిష్ట లాపాదింప జేస్తాడేమో ననుకొన్నాను. అతడు నాస్వేచ్ఛకోసం ఇదివరకనేక ఉపాన్యాసాలిచ్చి అనేక సభలలో మన్ననలందినవాడే. కానయితే, ఈవేళ మావాడు వెర్రికుదిరింది రోకలితలకు చుట్టమన్నాడు. ఆదేశంలో ప్రచారంలోవున్న ఒకపక్షము వారివాదం తలకెక్కింది మావాడికి. వింధ్యకి దక్షిణానున్న హిందువులంతా ద్రవిడులనీ, ద్రవిడులంటే తమిళులే అనీ అందుచే ఇదంతా ద్రావిడస్థానం; ఇందులో తమిళులదే సర్వాధికారంఅనీ వారంటోంటే మావాడు ఔనౌను, చిత్తం చిత్తం' అని బసవన్నలా తలూపుతో ప్రక్కతాళంవేస్తున్నాడే తప్ప 'ఆంధ్రులు ఆర్యులనీ, ఆంధ్రులజాతికి చెందిన మహారాష్ట్రులు (ఆంధ్రవంశస్థులు) ఈ వాదాన్ని స్థిరపరిచేరనీ తెలిసికొనక తనకి తెలియనివాదాన్ని ఆంధ్రచారిత్రకశాస్త్రజ్ఞులవల్లనైనా తెలిసికొనక వారివాదానికి తలఊపేడు. తను ప్రస్తుతం వున్న పదవినిబట్టేనా ఆలోచించ నక్కరలేదూ, తనమాటకి ఎంతవిలువ వుంటుందోనూ? ఆంధ్రుడైన విశ్వవిద్యాలయాధికారి ఈవాదాన్ని ఆమోదించేడంటే వారి వాదానికి ఎంతబలం?

ఇతరత్రావున్న నాబిడ్డలు తమ ఉద్యోగాలలో మునిగి తమ భాష, జాతీయత మరచిపోతోన్నారు. నాబిడ్డలందరికీ అనుకరణం బాగా పట్టుబడిపోయింది. ఏప్రదేశంలో ఎవరెలా చేస్తే ఆప్రదేశంలో నాబిడ్డలు వాళ్ళవలా అనుకరిస్తారు. ఈమధ్యనే నాపుత్రుడు సుబ్బయ్యనాయడు వంగదేశంలోని కూచ్ బీహార్ సంస్థానానికి దివానుగా నియమింపబడ్డాడు. ఇతనుకూడా ఒక బెంగాలీ బాబుగా తయారవుతాడో తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటాడో చూడాలి. ఇంక విదేశాల్లో వున్న నాబిడ్డలునేనంటో ఒకత్తెనున్నానన్న సంగతే మరచి పోయేరుగదా!' అని ఒక దీర్ఘనిశ్వాసం విడిచింది. ఇంతలో తూర్పున తెలుపు కన్పించగా ఆమె అదృశ్యమయిపోయింది.

## ౪

ఆమరుసాడురాత్రి ఆంధ్రమాత తిరిగి స్వప్నంలో సాక్షాత్కరించి ఇలా సెలవిచ్చింది. 'అబ్బాయీ! ప్రతీరాత్రీ నా గాథ వెళ్ళబోసుకొంటూ నీనిద్రకి భంగ మొనరుస్తున్నాను. కాని నీవలా భావించే వాడవు కావు గనుకా, నీవు నాగోడ వంతా శ్రద్ధతో ఆలకిస్తున్నావు గనుకా ఏమేనా లాభ ముంటుందేమోననే ఆశ చొప్పున ఈ నావిషయం యాకరువు పెట్టుతున్నాను. నన్ను ముఖ్యంగా వేధిస్తోన్న సమస్య ఏమిటంటే నేటి ఆంధ్రభాషాస్థితి. ఆంధ్రభాష చదువుకోవడం, ఆంధ్రంలో మాట్లాడడం అనాగరికతగా తోస్తోంది నేటి విద్యార్థులకీ, యువకులకీను. పెద్దలు పదవీవ్యామోహితులు. అటువంటప్పుడు ఆంధ్రభాష నుద్ధరించే దెవరు? బెంగాలీలనీ అరవల్నీ నాబిడ్డలు వేషభాషల్లో అనుకరిస్తారేగాని బెంగాలీల జాతీయతావికాసాన్నీ, అరవల మాతృభాషాభిమానాన్నీ అనుకరించరేమని నాశంక? దీనికితోడు పులిమీద పుట్రలా హిందీ వచ్చిపడింది. వంటింట్లోనూ, పడకటింట్లోనూ, పెళ్ళాం బిడ్డలతో కూడా హిందీయే కాని మాట్లాడని దీక్షాపరుడొకడు; కన్నబిడ్డకి హిందీలోనే అక్షరాభ్యాంచేసే నిర్భాగ్యుడొకడూ; ఇదీ నేటి ఆంధ్రుల భాషాభిమానము. గాంధీగారు హిందీ నేర్చుకోమన్నారు కాని మాతృభాషని చంపుకోమన్నారా? హిందీప్రచారాన్నంతగా అభిమానించే గాంధీగారు హరిజనపత్రికకు వ్రాసే తనవ్యాసాలు హిందీలోను, ఆంగ్లంలోనూ గాక తనమాతృభాషైన గుజరాతీలో వ్రాస్తాడెందుచేత? మన ఆంధ్రులు దీనిలోని అంతరార్థం గ్రహించగలిగేరా? గొర్రెలలా అంధానుకరణం తప్ప స్వతంత్రంగా వ్యవహరించడం తెలియునుగదా నాబిడ్డలకి?' అని కన్నీరు కాల్వలై పార విలపించింది మాత. ఇంతలో పక్షులు కిలకిలమనగానే ఆమె అంతర్ధానమైంది.

## ౫

అయిదవరోజుని కూడా ఆమె కనిపించింది. ఆవేళ ఆమె దుఃఖం కొంచెం ఊరట చెందినట్లుంది. చెక్కిళ్ళని బాష్పధారల ఛాయలు కనిపించినా బాష్పాలు రాలడంలేదు. నా డామె నన్నుద్దేశించి 'కుమారా! నీవంటి వా రెంతప్రయత్నించినా పరుల దాస్యభావంలో పడిపోయిన మన పెద్దలికి నచ్చదు. నీలాటి యువకులే ప్రబోధం కలిగించి జాతీయత పెంపొందించాలి. ఆంధ్రభాషనీ, ఆంధ్రజాతీయతనీ వృద్ధిచేసి ఆంధ్రులు భారతదేశంలో అభ్రంకషస్థానంలో నిల్వాలి. ఆంధ్రులలో మేటిరత్నాలున్నాయి. కాని వాటిని ఆంధ్రత్వమనే ఆకుజాతితో సానపెట్టితేనేకాని ప్రకాశించవు. నాయనా! యువకులు, స్వతంత్రులు. వారికి పెద్దవారిలా సంకెళ్లులేవు. పరానుకరణం లేకుంటే యువకులే పనికివస్తారు. నాదుఃఖం తీరడానికి యువకులు ముఖ్యంగా మూడుపనులు చెయ్యాలి. ౧ ఆంధ్రుల ఐక్యీకరణం, ౨ ఆంధ్రభాషోద్ధారణ, 3 ఆంధ్రజాతీయతాభివృద్ధి. ఈమూడూ నా స్వాతంత్ర్యానికీ, నా సంతోషానికీ పునాదులు. ఈకార్యాలు యువకులే నిర్వహించాలి.

నాయావద్వృత్తాంతం చెప్పేను. రేపటినుండి నాదర్శనం నీకు లభించదు. కాని ఎప్పుడేనా నా అవసరంవొస్తే రాత్రి మనస్సులో నన్ను తలచుకొని శయనించు. నే నిదే ప్రదేశంలో ప్రత్యక్షమవుతాను. నేను చెప్పినట్లు యువకుల్లో ప్రబోధం చేస్తావా?'' అంది.

''మాతా! అవశ్యం చేస్తాను'' అని ప్రణమిల్లగా ఆమె తన దక్షిణహస్తాన్ని నా శిరస్సుపై నుంచి ఆశీర్వదించి అంతర్ధానమయింది. శకుంతముల కలకలధ్వనులతో తెల్లవారింది.

# దీపావళినాడు

రచయిత :

సి. యస్. శర్మ.

జనం! ధనం!

ఆదీపావళి సామాన్లను చూస్తో, ఉత్సాహానందాలతో పొంగిపోయింది ఆ చిన్ని హృదయం.

చిన్న చిన్న పిల్లలకు తండ్రులు కొని యిస్తున్న దృశ్యాల్ని చూసి, తనకెవ్వరూ కొని యివ్వడంలేదేఅని నిరాశతో క్రుంగిపోయింది ఆగుండె- నిరశ్రురోదన చేస్తో!

ఎవరి సరదాలు వారివి. రాముం చేస్తున్న నిరశానిరశ్రురోదన వినే దెవరు? ఓదార్చేదెవరు?

కదలలేక కదలలేక- పెద్ద నిట్టూర్పు విడిచి అక్కణ్నుంచి కదిలాడు రామం.

'నాన్నా! నాకొక్కని యివ్వవు?' అని అడగలేక అడగలేక అడిగాడు,-దమ్మిడీ చేతిలో లేని ఆగర్భదరిద్రపుతండ్రిని!

'చూస్తున్నావుగా బాబూ! మనబ్రతుకు! ఈపూటకుంటే, అపూటకు లేదు!' అని కంట నీరెట్టాడు ఆకన్నతండ్రి!

కన్నీళ్ళను హృదయంలోకి కుక్కుకుంటూ, బజార్లోకి పారిపొయ్యాడు

ఆకల్ని తోసేసుకుంటూ, అల్లా చూస్తూ, నిలబడిపొయ్యాడు- రామం! చీకటి పడిందాక!

* * *

దీపావళి రాత్రి! దీపాలకాంతితో మెరసి పోతోంది, ఆ అమావాశ్యరాత్రి. ఇంటింటా దీపాలు! నవ్వుల మంటలు!

గుమ్మంలో, ఒంటరిగ వెల్గుతున్న ఆముదప్రుదీపం దగ్గరకూర్చుని, కళ్ళతో చుట్టూచూస్తున్నాడు రామం.

చింకిశాల్వను కప్పుకుని, అవమానాగ్నిలో కాలిపోతోంది గదిలో ఆముసలిగుండె!

చీకట్లను చీల్చుకుంటో, చుక్కల్లోకి పోతున్నై తారాజువ్వలు!

చుట్టూ దీపాలు... మంటలు ... చప్పుళ్ళు!

రామం కళ్లు మూతలు పడ్తోవుంటే ఒళ్లు ముడుచుకుని, తండ్రి దగ్గర పడుకున్నాడు!

చినుకులు ఇంటింటి వెలుగుతున్న దీపాలార్పేశాయి. ఆకాశాన మెరుపులు!... ఉరుములు!

తలుపులు బిగించుకుని వెచ్చగ పడుకున్నారు 'కల' వాళ్ళు.

రామంలాంటి లేనివాళ్లు, ఒళ్లుముడుచుకుని ఆకలితో, నిరాశతో నిద్రపోతున్నారు!

* * *

తెల్లవారింది!

లేనివారి బ్రతుకుకూడ...!

దీపావళినాటి తుఫాను, పాతిక మంది పెద్దవాళ్ళనీ... పదిమంది చిన్నవాళ్ళనీ... మింగేసింది.

ఆ కునుకువేసిన ప్రాణుల్లో రామం-రామం తండ్రీకూడ వున్నారు!

దుర్భరదారిద్ర్యదావానలం లోంచి, విముక్తులనుగ చేసింది ఆతుఫాను!

ఆతుఫానుకన్నా జాలివుందిగాని లోకానికి లేదు.

రోడ్లనూ, గోడల్నీ కడిగేసింది శుభ్రంగా!

కానీ, సంఘంగుండెని కడగలేకపోయింది!

అసలు సంఘానికి గుండెవుందాఅని!

# హృదయపరివర్తనం

[కళింగయుద్ధం చేసిన తరువాత అశోకచక్రవర్తి హృదయంలో కలిగిన పరివర్తనాన్ని ప్రస్తావించే ఏకాంకిక. ఈ పరివర్తనంతో అశోకుడు లోకారాధ్యుడై మిగిలాడు.]

రచయిత:

మోతుకూరు వెంకటేశ్వర్లు

(ప్రదేశం- యుద్ధభూమి. అంతటా మానవుల మొండాలు, చేతులు, కాళ్ళూ, శిరస్సులూ, కత్తులూ,- నెత్తురుతోకూడి- చెల్లాచెదరుగ పడివుంటాయి. యెంత దూరంచూచినా పీనుగుల మొండాలు కనుపడుతూ వుంటాయ్! అప్పుడు సాయంకాలం ఆరైవుంటుంది. సూర్యుడు ఈ బీభత్సాన్ని చూచి రక్తాంకిత నేత్రములతో అస్తమిస్తుంటాడు. దేశంకూడా అదో విధమయిన యెరుపురంగులో లీనమవుతుంది. కొద్దిదూరంలోవున్న శిబిరంలో 'అశోకచక్రవర్తి' యుద్ధపుదుస్తులతోనే,- వికలహృదయంతో, అటు యిటు తిరుగుతుంటాడు. క్రింద తివాచీలు పరచివుంటాయి. ఒకప్రక్క బల్లను, యీజీ నిలబెట్టివుంటుంది- దానికి డాలు తగిలించబడివుంది- దానికి దగ్గరగనే, మెత్తని పరుపూ- పైన రత్నకంబళీ- ముఖమల్ తలగడా వుంటై! దానికి దక్షిణంగా- పైవిధంగా, ఇంకోపరుపూ- తలగడావుంటై! శిబిరానికిబైట యిద్దరు పహారావాళ్ళు పచారుచేస్తుంటారు-)

అశోకచక్రవర్తి :

(తిరుగుతూ) అయిపోయింది... నేటితో, కళింగచక్రవర్తుల గర్వబలిమి అణగారి పోయింది...

సాధువు :

(బయటనుండి- కీర్తనపాడుతూ)

క్షణభంగురమే!- జీవిత మిదిరా-
రాజ్యము స్థిర మటరా ?- క్ష॥
యెందుకీ, ప్రాణుల,-శోకారవములు,
ధర్మము మది గనరా ! క్ష॥

అశోకుడు :

——యెంతచక్కని వుపదేశం, వుంది ఆగీతంలో...నిజం, ఆప్రాణులు- పాపం, యెంతగా విలపిస్తున్నాయో కదా?-.. అబ్బా, యేమిటా రోదనలు-. అయ్యయ్యో, పశువధ జరిగినట్లు జరిగిపోయింది... ఒకటా, రెండా,- లక్షమంది?... మ్చ్- మ్చ్- హృదయమెంత కఠినమైంది...అయ్యో!...

బయటనుండి సాధువు:

[పైకీర్తనే,-పైవిధంగా]

ప్రపంచమేలిన, పాండవులేరీ ?-
శిబిమొదలగు మరిప్రముఖులదెక్కడ?
ధరణీతలమును శిరమున మూర్కొని
జనిరా-యెందయినా?- క్ష॥

అశోకుడు :

...యెందుకొచ్చినది యీరాజ్యతృష్ణ! — అబ్బా, హృదయమెంత కఠినమైంది...ఛీ, అశోకవర్ధనుడా, నీకు- నీవంటి మానవులను చంపుటకు చేతులెట్లాడినవి?- నీవునూ, ఒక వీరుడవేనా?...ఘోరరూప రాక్షసుడివి!... అబ్బా, యీరక్తపుటేరులు చూడలేను. ఆ వికలాంగులు జీవములుపోక, యెంత విలపిస్తూ బాధపడుతున్నారోగదా?... (అలానే తిరుగుతూ బయటకు చూసి) - ఎవరురా- అక్కడ ?

భటుడు :

(ప్రవేశించి-నమస్కరించి) ప్రభూ !

అశోకుడు :

——మంత్రిని పిలుచుకురా.

(భటుడు నమస్కరించి వెళ్ళి- మంత్రితో ప్రవేశించి) ప్రభూ !— మంత్రిగారు.

(శిబిరములోనుండి- గవాక్షముగుండా, బయటకుచూస్తూ, ఆలో

చనలలోనున్న అశోకుడు వెనుకకు తిరిగి మంత్రివేపు చూస్తాడు.)

మంత్రి :

(నమస్కరించి)...ప్రభూ! ఎందుకు పిలిపించారు.

అశోకుడు :

(పెద్ద నిట్టూర్పుచేసి)— యెందుకో తెలియునా?—

మంత్రి :

(తెలియదన్నట్లు తల వూపుతాడు)

అశోకుడు :

...యీరక్తపు టేరులలో, ప్రాణములుపోక, విలవిల తన్నుకుంటున్న ఆవిగతజీవులనూ- ఈ దెబ్బోటులకు, బాధపడుతూ ప్రాణములు పోక ఘోషిస్తున్న ఆ యేనుగులు- గుర్రములనూ,—సైనికుల నాశాల్లోంచి,- యెడతెరపిలేకుండా, రుధిరం- ధారాపాతమై స్రవించడం చూచైనా, గ్రహించలేవూ?—

మంత్రి :

(ఆశ్చర్యంగా) అదేమిటి - ప్రభూ!

అశోకుడు :

యేముంది - ఆవికలాంగుల నరాల్లోంచి- స్రవించే, రుధిరాన్ని నేను చూడలేను...మన సైన్యాన్ని వెనుకకు మరలించి—

మంత్రి :

(చకితుడై)ప్రభూ—నిజమేనా?—

అశోకుడు :

నేనిక యుద్ధంచేయలేను.

మంత్రి :

...దేవరకు, హృదయంలో- అస్వస్థతగా వుందని తలుస్తాను. లేకపోతే, అనంతమయిన, యశశ్చంద్రికల సంపాదించిన, సమ్రాట్—అశోకచక్రవర్తి! చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారే!-

అశోకుడు :

(కనుబొమలు చిట్లించి) విచిత్రమేమీలేదు- మానవులను, పైశాచికకృత్యముగా వధించి- రాజ్యతృష్ణ నలవరచుకొనటం, నేను యికనుండి చేయలేను...

మంత్రి :

(సగంవంగి) మహారాజ్!... అశోకచక్రవర్తి అనిన అనంత దేశాలూ... మీకు జోహారులు చేస్తున్నపుడు- మీప్రతిభవల్ల- కళింగరాజ్యలక్ష్మి మిమ్ముల చేపట్టడం- యిక్కడనుంచి దక్షిణాపథానికి...

అశోకుడు :

చాలు- యీనరహత్యలు నేను చేయలేను...నేటినుంచే, నామనోనేత్రం తెరువబడింది.

మంత్రి :

సామ్రాట్!...

అశోకుడు :

యిటుచూడు (శిబిర గవాక్షము పైకినెత్తి) ఆ వికలాంగుల ఆర్తనాదాల్లో నీకు,—నిజంగా దయకలుగడంలేదూ!— బీడువారిపోయిన, యీ మొండిహృదయంలో, కలిగిన యీ ఆవేదనవల్ల —సహజమానవత్వం—కరుణ, దయ—ఒక్కసారి పైకుబికాయి, ఆమనస్సుతోనే,- యికనుంచి కత్తిని...

మంత్రి :

(చూచి)- సామ్రాట్! యిది అంతా మానసికదౌర్బల్యం- విదిలించివేయండి శత్రువుని ఖండించినట్లు- అయినా వారు వీరులు,యుద్ధరంగంలో మృతిపొందారు-యిక విచారించడం దేనికి (కొంచెం సేపాగి) ఈ జయంతో యిక అడ్డెవ్వరు మీకు?—

అశోకుడు :

అడ్డున్ననూ, లేకున్ననూ-నేనిక కత్తిపట్టి ముందుకు నడిచి, జనక్షయాన్ని చేయలేను...చూచావా,- పాపము యెంతమంది నా రాజ్య తృష్ణకుగాను, ఆలుబిడ్డలిని- తలిదండ్రులను, వదిలి- అసువులను పోగొట్టుకున్నారో?...యీ యువసైనిక రక్తపుటేరులు, ఝురీవేగాన్ని- నాశ్రవణగోళాల్లో, 'అశోకుడు, అశోకుడు' అంటూ- ప్రవహిస్తూ, ఆక్రందన చేస్తున్నాయి ...వినబడుటంలేదూ, నీకు?

మంత్రి :

మహారాజ్!- మీమనసులోని మార్పే కాని, మరేమీలేదు-... మనసు తన సహజత్వాన్ని కోల్పోయినపుడు- యిలా కరుణఅనే,- 'మార్పు' కలుగుతుంది. అదే, యీరోజు మీమనసును వ్యాకులముగ నుంటచే,- మిమ్ముల తన వేపుకి త్రిప్పుకొంది?-...దానితో

కర్తవ్యశూన్యులై కార్యాన్ని మరచిపోతున్నారు, ప్రభూ!

అశోకుడు :

(గవాక్షపు తెర మూసి – అటు యిటూ తిరుగుతూ) మనసు తన సహజత్వాన్ని కోల్పోతే– కరుణ కలుగుతుంది. అదే నేను, వాంఛించేది. చూడు–ఆసైనికుల భార్యలు బిడ్డలు,...నారాజ్యతృష్ణను గురించి– నన్ను ఏవిధంగా తూలనాడుతుంటారో,...

మంత్రి :

—ప్రభూ ! మీరీ కరుణను, ఒక్కసారి విదలించి– మరల మీ శక్తిని ప్రబలించండి!– దానితో, దక్షిణాపథమంతా– మీ ఆధీనమౌతుంది...సామ్రాట్! విజయగీతాలు, కోలాహలంగా మిన్నుముట్టి– అంబరవీధిపై మిరుమిట్లు గొలుపుతూ నర్తిస్తయి...రాజుల మూర్ధభాగమందలి రత్నకాంతులు, తావకసింహపీఠికడ, తమశోభను వెలుగందజేస్తయి...

అశోకుడు :

(కళ్లు పెద్దవిజేసి) యీరాజ్యకాంక్షే,– అశోకవర్ధనునిలోని ప్రేమజ్యోతిని నాశనమొనరించి– తన పిశాచాకృతితో, విజృంభించి– అశోకునిచేత, యింతమంది నిరపరాధులను తనపొట్టను బెట్టుకుంది; ...ఈ కఠినాత్ముకుడు, – రేపటి రోజున దేవునియెదుట– అపరాధి!–

మంత్రి :

మహాప్రభూ!– ఈయుద్ధంలో చనిపోయినవారికి, మీరెట్లా ద్రోహులవుతారు?...ప్రతిప్రాణి గిట్టక శిలవలె నిలచియుండునా?– తమ ప్రభువులకు నమ్మిన బంట్లగుటచే,– ప్రాణములను లక్ష్యపెట్టక, ప్రభువుల సంరక్షణ నిమిత్తం, ప్రాణములను కోల్పోయి– వీరస్వర్గమలంకరించారీసైనికులు !–... అందుననూ, యుద్ధంలో చనిపోయినవారు ఆయువు నిండినవారు.

అశోకుడు :

నీవూ– మానవుడవేనా ?– అయితే, నీలోని హృదయం పాషాణమైంది. అటుచూడు.– ఒక ప్రక్క– తెగి, చేతులు కాళ్లు విరిగి– అవయవములు కత్తిరించుకపోయి... ప్రాణాలుపోక, వికలాంగులై – బాధపడే, ఆ సైనికసమూహం ఆర్తనాదాలు!...అశోకుని ప్రాణనిర్మూలమునకై – భగవంతుని వేడుకుంటున్న ఆక్రందనాలు... కడబట్టిన వారి ప్రాణాల అరపుల్లో వినబడుటంలేదూ ?– అరక్తపు టేరులతో పాటు, యింతమంది ప్రాణాలు– సూర్యునిఅస్తమించడంతో, జీబూతాల్లా– యెలా నావైపుకి వస్తున్నాయో?... యిన్ని జీవులు.... యీకంకాళాలు... యీ రుధిర పిపాసువుని,– నరహంతకుడని, చింతిస్తయి కాబోలు!—

మంత్రి :

—సామ్రాట్,– యిది మనశ్చాంచల్యం–... ధర్మపరుడయిన మహారాజుకి– రాజ్యకాంక్ష– యుద్ధము,– క్షత్రియుల లక్ష్యములు... యుద్ధంలో జయలక్ష్మినిపొంది, క్షత్రియకర్మ వర్తిస్తున్నారు.

అశోకుడు :

అవును. మనశ్చాంచల్యం. వికలహృదయం– చపలత్వం– కాకపోతే,– యింతమంది అసువులను, ఎందుకు బలిగొంటాడీ అశోకుడు.

మంత్రి :

ప్రభూ!– నేచెప్పేదదికాదు. తమలో కలిగిన యీ 'మార్పు'కు ..

అశోకుడు :

క్రొత్తసిద్ధాంతాలు– చెప్పుతున్నారమాత్యులు–

మంత్రి :

కాదు ప్రభూ!– రాజుకు రాజ్యకాంక్ష– యుద్ధమూ, ఏమీలేని స్థితిలో,—తనరాజ్యమునందరాజకము ప్రబలి– తమమాటకే, యెదురుతిరిగి ప్రజలు, సుభిక్షముగ మిమ్ముల నుండనిచ్చెదరా?–ప్రభూ! ఏది త్రోసిపుచ్చినను, తన స్త్రీల మానమర్యాదలు యెలాకాపాడుతుంటాడు?—సామ్రాట్... యిది నేను చెప్పవలసినవాడనుగాను, క్షత్రియుడై పుట్టినతరువాత, అనులంఘ్యముగా – యివి వుగ్గుపాలతో పెట్టబడినవే!– యిదే కాలచక్రంలోని పరిభ్రమణ...రహస్యం!— యీవిషయాలు తమబోంట్లకు క్రొత్తవికావు...మహారాజ్ !– మీలో యీమార్పుకలగడం, తమ యొక్క మానసిక దౌర్బల్యాన్ని బయట కుబికించి– తమకు కరుణను కలుగచేసింది'...యుద్ధంలో వీరులు స్వర్గప్రాప్తిచెంద– దానికి కా

రకుడు అశోకచక్రవర్తియా ?- కాదు- అశోకచక్రవర్తికాదు.

అశోకుడు :

నీవు నిరూపించే సూత్రాలు- నాకవగతం కావడంలేదు?...కొంతసేపు నేను రాజునన్నమాటను వదిలి- మనము సహజమానవుల్లా, ప్రవర్తించుకుందాం?... యిప్పుడు చూడు, రాజుకుగాని- రాజపోషిత వర్గములో మెలిగే, వారికిగాని — హృదయముండదని నేనంటానా?- యేమంటావ్ ?—

మంత్రి :

—సామ్రాట్!- తన హృదయాన్ని అరికట్టక,- నిరంకుశంగా, ధర్మమంటూ పాలించే రాజు- స్వధర్మభ్రష్టు డౌతాడు?-

అశోకుడు :

(మాట వినకుండా) పాపం చూడు,- రాజ్యతృష్ణ యజ్ఞంలోబడి- వీరులు, తమవృద్ధులయిన తలిదండ్రులను- బిడ్డలను, భార్యలను, గోల్పోయి- యజ్ఞపశువుల్లా యెంతమంది తమ అసువులను పోగొట్టుకున్నారో...పాపం!

మంత్రి :

సేవకధర్మం- మంచిదే!-

అశోకుడు :

మంచిదే!—అవును ఆశ్చర్యం, రాజకీయరణరంగాల్లో మెలగడం వల్ల- సహజ మానవహృదయం, తన పటిమను కోల్పోయి మొద్దువారిందికాబోలు...చేసేది, హృదయం లేకుండా- భీకరంగా, శత్రువులను నిర్దాక్షిణ్యముగా చంపుతూ వున్నందువల్ల- భీకరపిశాచమూహ్యాదిని ఆవరించి, వికటస్వరూపంతో...నృత్యంచేస్తూ- కరుడుగట్టిందేమో !

మంత్రి :

కాదు ప్రభూ!- దేశకళ్యాణం- మానవ మారణయుద్ధం,- లేకుండా -దేశం తన సహజస్వరూపాన్ని కోల్పోయి, వికటాట్టహాసంగా,... క్షామంతో పీడింపబడి- దుఃఖభాజనమవుతుంది.' ఆనాడే దాని కధోగతి సంభవిస్తుంది! ...యెక్కడచూచినా, దోపిడులు- హత్యలు- ప్రబలిపోతాయి!.. తిరిగి దాన్ని అభివృద్ధిలోకి తీసుకరావాలని సుభిక్షంగా వుంచాలని తలుస్తే- ముఖ్యమయినపరికరం ఆయుధం యుద్ధం- వుండాలి!...మరణం లేకుండా, మానవు లధికసంఖ్యలైనపుడు, ఏదోవిధంగా యిటువంటి యుద్ధంవుండాలి... లేకపోతే, దేశం- తనపుత్రులనే కాపాడుకోలేని హైన్యస్థితికి వస్తుంది...ప్రభూ! — యిది పూర్వులనుంచీ, పారంపర్యంగా అందరికీ,- అవగతమైయున్న విషయమే!-

అశోకుడు :

...నీమనసు, - యీవిషయంలో ఆలోచనాపటిమను కోల్పోయి తలక్రిందులైనట్లుంది!...యీనెత్తురును, యీశవములను చూచి, గంభీరము వహించింది!... దేశం సుభిక్షంగా- కళ్యాణమయంగా కనుపించాలి అంటే!- యజ్ఞపశువుల్లా- దయాదాక్షిణ్యాలు లేక, అందరినీ చంపేందుకేనా- యుద్ధం!.. సుభిక్షంకోసం- మానవుల్ని మారణహోమంలోకి- నెట్టాల్సిందే?- యిదేనా, నీవిశ్వమానవప్రేమ? నీపుత్రుని ప్రేమించే- నిర్మలప్రేమతో, తోడిమానవుని ప్రేమించు. అపుడు సహజభాతృత్వం కలిగి లోకంలో- 'ఆనందం, శాంతి' చేకూరుతై !- అంతేగాని, కరుడుగట్టిన పాషాణహృదయంతో- పదిమందిని చంపినంతమాత్రాన,- విశ్వమానవప్రేమ యెలాకలుగుతుంది. సహజసోదరభావం- యెలా యేర్పడుతుంది ?-

మంత్రి :

—సామ్రాట్, చక్రవర్తులు ...'ఆనందం- శాంతి'- విశ్వప్రేమ అంటూ కత్తినిపట్టుకోనక కూర్చుంటే, తమదేశంలోవున్న ప్రజలకు- తమభార్యల మానమర్యాదలను, తమప్రాణములను రక్షించుకొనుటకుగూడా- చేతకాక, కారడవులకు దారితీయవలసిందేగదా?- తనరాజ్య మప్పుడు పరుల ఆధీనమవుతుందనడంలో, అతిశయోక్తి వుంటుందంటారా? సామ్రాట్, భారతజాతి కప్పు డధోగతిసంభవించి తినుటకు తిండీ- కట్ట గుడ్డలేక, మలమలమాడి చావవలసిందే కదా- ప్రభూ!- యీపరిస్థితిలో...

అశోకుడు :

పిచ్చివాడా?- యింకనూ, రాజకీయరణరంగాల్నిగురించి మాట్లాడుతా వెందుకు? యిటుచూడు

[కొరవ ౭౪-వ పేజీలో

# నకలు శివాజి

జర్మన్ నియంత హిట్లర్‌కు నకలు హిట్లర్‌లు
వున్నారని నేడు వింటున్నాము. అల్లే వెనక మన
శివాజికికూడ నకలు శివాజి ఉండడమూ, అతని
సాయంతో శివాజి కొన్ని అద్భుత కార్యాలు
చేసి వుండడమూ ఈ కథ చమత్కారంగా
చూపిస్తూ వుంది. —సంపాదకుడు.

రచయిత:

## అలంపురంరాజు, బి. యే.

### క

ఔరంగజేబు ఢిల్లీ చక్రవర్తియైయుండెను. ఆతని కఠోరశాసనములవలనను, క్రూరపాలనమువలనను భారతసాగరజలములందు రాజపుత్రుల స్వాతంత్ర్యము మునిగిపోవుచుండెను. అంబరసంస్థానాధిపతి జయసింహుడు ఢిల్లీసింహాసనమునకెదుట బద్ధహస్తుడై నిలచెను. మారవాడ యశవంతసింహుడును రాఠోర రాజసింహుడును ఢిల్లీసింహాసనమున కలంకారకలశములైరి. ఉత్తరహిందూస్థానమున సిక్కు రాజ్యములును; దక్షిణమున గోల్కొండ, బీజపూరు సంస్థానములును క్షీణించి యస్తమించుచుండెను. లోకైకవీరుడగు శివాజి మహారాష్ట్రసామ్రాజ్యమును నిర్మించుటకై హిందువులనేకముఖముగ జేయుచుండెను. భూకంపసంక్షోభముచే సముద్రగర్భమునుండి నవీనద్వీపము తెలయెత్తునట్లు శివాజి దోర్దండప్రతాపముచే ప్రాచీన హిందూరాజ్యముల భగ్నావశేషములనుండి మహారాష్ట్రరాజ్యము తలనూపుచుండెను.

ఈ 'పర్వతమూషకము' ను పట్టుటకై మొగలుసేనలు దక్షిణమునకు దండెత్తి వచ్చెను. పురందరదుర్గమున మహాసంగ్రామము జరిగెను. దీర్ఘదర్శియగు శివాజి మొగలు చక్రవర్తితో నేలనో సంధి చేసికొనెను. ఆసంధి ననుసరించి శివాజి ఢిల్లీదర్బారులో ఔరంగజేబును చూడవచ్చెను.

### చ

సువర్ణనిర్మితమై, అమూల్యనవరత్నఖచితమై, ద్వాదశస్తంభాదృతమై యొప్పు మయూరాసనముపై మొగల్ చక్రవర్తి యాసీనుడైయుండెను. శివాజి మాయావియని తెలిసియుండుటచే యాతడు విశేషముగ అంగరక్షకులనిడికొని లోహకవచమును ధరించియుండెను. మొగలు మహత్వమును, హిందూయల్పతయును శివాజికి చూపుటకా యన్నట్లు ఆనాడాస్థానమంటప మలంకరింపబడిన ట్లిదివరకెన్నడును యలంకరింపబడలేదు. భూభాగమంతయు రత్నకంబళ్ళచే గప్పబడెను. పట్టు జాలారులును, ముత్యపుతోరణములును, కృత్రిమ సువర్ణపుష్పాలంకారములును మందిరమును శోభింపజేయుచుండెను. సింహాసనమున కిరుగడల సువర్ణ రజత చంద్రకాంత నిర్మితములగు మూడు వేదిక లొకదానికంటె మరొకటి కొంచము పల్లముగ నిర్మింపబడి యుండెను. సంస్థానాధీశులును, రాజకుటుంబమువారును స్వర్ణవేదిక నలంకరించిరి. సైన్యాధిపతులును, ఇతర యున్నతోద్యోగులును రజతాసనములపై గూర్చొని యుండిరి. చంద్రకాంతవేదికపై ఇతరు లాసీనులై యుండిరి.

తన్నెదుర్కొనుటకు ఔరంగజేబు స్వయముగ రాక యాతని జ్యేష్ఠపుత్రుని పంపి తనకు చూపిన యనాదరమునకు శివాజి కినుకబూనియుండెను. రాజసింహుడు శివాజిని చక్రవర్తియొద్దకు గొనిపోయెను. చక్రవర్తి తన కుడిభుజమునకు చేరువనున్న స్వర్ణవేదికపై శివాజిని కూర్చుండమనెను. శివాజి కూర్చుండి తక్షణమే క్రిందికిదుమికి 'నాకుడిప్రక్కనున్నవారెవ'రని గంభీరముగా ప్రశ్నించెను. రాజసింహు డప్పుడు చిరునగవుతో 'మారవాడ సంస్థానాధీశుడు యశవంత సింహు'డనియెను. శివాజి ముఖ ముజ్వలమై ప్రకాశించెను. అవమానశూలపుంఖాతతిని కుపితుడౌటచే యాతని ముఖమెర్రబారెను. ఆతడు గంభీరస్వరము

తో యశవంతసింహుని సహపంక్తిని కూర్చొనుటకు నాకు యోగ్యతకలదా? స్వదేశాభిమానము, స్వాతంత్ర్య పరాయణత, స్వధర్మానురాగముగల యెవరేని ఈమంటపమందుండినచో వారి సహపంక్తిని గూర్చొనుటకు నేనర్హుడను. మొగలు సామ్రాజ్యపు జాగీర్దారులని గొప్ప గొప్ప బిరుదులు పొందిన మహారాజపుత్రులతో కూర్చుండుటకు నాకు యోగ్యతలేదు. చక్రవర్తి యందరికిని మర్యాద నొసగెను. దానికి బదులుగా హిందువులు రాజమర్యాదను చక్రవర్తికి ధారపోసిరి. ఈగౌరవము చిత్తూరు రాణాకును, మహారాష్ట్ర శివాజికిని దక్కలేదు. అంతటిగౌరవమును ఈనాడు యశవంతసింహ, రాజసింహ మొదలగువారి సహపంక్తిని గూర్చుండి నేను పొందయాశించుట లేద'ని చక్రవర్తివంక జూడకయే, యాతనికి సలాముచేసి శలవు గైకొనకయే యచటనుండి చరచర బయటికి నడచిపోయెను.

శివాజి యాడిన మాటలకు రాజపుత్రులధోవదనులైరి. చక్రవర్తికి చూపిన యలక్ష్యభావమున కాతడు కుపితుడయ్యెను. తోడనే చక్రవర్తి రాజసింహుల కీ రహస్య సంభాషణ జరిగెను.

'ఏమిది?'

'వనసింహము బోనులో చిక్కుకొన్నది'

'అందుకా బొబ్బ ఇడుచున్నది!'

'ఔను, మృగము నేమిచేయవాజ్ఞ?'

'దానిని సురక్షితమైన బోనులో నుంచుము.'

'చిత్తము'

౮

ఢిల్లీనగరమున సంస్థానాధీశుల చాకులలో నన్నిటికంటె రాథోరు సంస్థానాధీశుడును, చక్రవర్తి కాంతరంగిక మిత్రుడునగు రాజసింహుని మందిరము సుందరమైనది. ఆభవనములో రెండవయంతస్తులో దీపమొకటి ప్రకాశించుచున్నది. దాని ప్రక్కనే మరొకదీపము—అనంగరంగమయమా అంగనారత్నప్రదీపము, ప్రజ్వలించుచుండెను.

ఆమె యసాధారణరూపలావణ్యరాసియనుటకు వీలులేదు. కాని యామె శరీరమునంతటిని యొకవిధమగు చిత్తాకర్షక సౌందర్య మావరించియున్నది. ఆమె ముఖమందుండు మాధుర్యమును, మోహనశక్తియును నామె సౌందర్యమునకు ప్రత్యేకత యొసగుచున్నవి. పరీక్షించిచూచినచో ఆమె ముఖసౌందర్యమున కడుగున మనఃక్లేశము సంచరించుచున్నట్లు గోచరమగుచున్నది. వైశాఖసూర్యాతపముచే కందిన కోమల పుష్పవల్లియు, దవానలోష్ణస్పర్శచే వాడిన కర్ణికార పుష్పమును యెట్లు విషాద వినోదముల నొకేసారి మనస్సున నుత్పన్నము చేయునో యాభావనమే యీ సుందరిదర్శనము ప్రేక్షకుల కొనగూర్చుచున్నది.

మేడమెట్లపై చప్పుడు వినవచ్చెను. 'శైలిని! శైలిని!' యని యెవరో పిలచినట్లు విననయ్యెను. శైలిని లేచునంతలో యామెతండ్రి రాజసింహుడా గదిలో ప్రవేశించెను. తోడనే శైలిని యొసగిన యాసనముపై ఆతడు విశ్రమించెను,

'తండ్రీ! మిమ్ములజూచి రెండుదినములైనది. నగరమందున్నప్పుడుకూడ దర్శనభాగ్యము కొరవడుచున్నదిగదా.'

'రాజకార్యనిమగ్నుడ నౌటచే తీరికలేకపోయినది.'

'విశేషములేమి?'

'వృద్ధాప్యమునందున్న నాకోర్కె నీవు నెరవేర్చక పోవుటయే విశేషము.'

'మీరు సుఖముగనుండుటయే నాకోరిక. ఈ మీకోర్కె కంగీకరించక పోవుటచే మీకసౌఖ్య మెటుల గలుగును?'

'నీవు మొగల్ సామ్రాజ్యపు రాణివై యుండుటకంటే వేరొక సంఘటన నా కధికసంతోష మొనగూర్పగలదా?'

'తండ్రీ! అంతటిదుర్గతి నాకు వలదు. మొగలుచక్రవర్తి భార్యనగుటకంటె సామాన్యహిందూపౌరుని తోత్తుగా జీవించుట కిచ్ఛగింతును.'

'శైలిని! చక్రవర్తినివరించు భాగ్యము హిందూదేశమునందు నీకు సాధ్యపడుచున్నదిగాని మరొకరికి సాధ్యమా? చక్రవర్తి మామ యనిపించుకొనుటకంటే యధిక గౌరవ మీ జన్మయందు నాకు లభించునా? సామ్రాజ్యపాలకుల రాజకుటుంబమునకు చెందినవారని మన బంధువు లనిపించుకొనుటచే మన వంశమునకు కీర్తి యినుమడింపదా? సామాన్యరాజపుత్రుని వరించుటలో యందమేమి?'

'ఆదురదృష్టము నాకు లభించుటకు పూర్వమె యీబొందినుండి ప్రాణముల నాపరమాత్ముడు వేరుజేయుగాక! అక్బరుకు కన్యనిచ్చిన రాజపుత్రకుటుంబమునకేమి గౌరవము హెచ్చెను! రాజా మానసింహుని పుత్రిక సలీమును పరిణయమాడి యేమి ప్రఖ్యాతిబొందినది? ప్రస్తుత మవురంగజీబు పత్నియగు ఉదయపుర రాజపుత్రి కన్నీటిని గార్చుటలేదా? ఔరంగజీబు బంగారు సంకెలలకు చేయినొసగిన

మన్న కులమున కేమి యశస్సువచ్చినది? తండ్రీ! నేను నిజమాడితినని కోపము జెందకుము. నాయిష్టమువచ్చినవానిని వరింపనిమ్ము.'

'ఔరంగజేబు జ్యేష్ఠపుత్రుడగు ముఆజమునకంటె యోగ్యుడగు వేరొకవరు డెవడును నీకు లభించడు. అతని పాణిగ్రహణమే మన వంశోద్ధరణ.'

'తండ్రీ! మీతో నోరుతెరచి చెప్పుటచే లజ్జావిహీనురాలనని తలపకుడు. హిందూరాజాధిరాజును విడచి వేరొకని వరింపనొల్లను. అతనిచేరక మొగలుల కేనాడు మన సంస్థానస్వాతంత్ర్యమును బలినిచ్చితిమో, ఆనాడే మన వంశము కళంకితమైనది.'

రాజసింహుని కీమాటలు బహు కటువుగ దోచెను. పచ్చివెలగకాయ ముక్క కంఠమునదిగునట్లా మాటలు వాని కర్ణముల నతి కష్టముతో ప్రవేశించెను. హృదయచాపల్యముతో నొక్క నిముషమటునిటు చూచి 'హిందూరాజాధిరాజెవ'డని కుమార్తె నడిగెను. శైలిని మందస్వరముతో 'శివాజిమహారా'జనెను. అనుటయు ముక్తకంఠముతో నాతని బొగడుటయు విని రాజసింహుడు నిరుత్సాహము జెందెను.

మరల సుద్రేకవదనముతో రాజసింహుడు 'శైలీ! పెంకెపట్టు పట్టకుము. మహారాష్ట్రులు క్రూరులు,' అన్నాడు.

'అవును. నాకదియును తెలియును. ముసల్మానులు మ్లేచ్ఛులు'

'ఎంతహఠము! దీనికి నిన్ను దూషించుటవలన ప్రయోజనములేదు. నిన్ను ప్రతాపగడ కేనాడు నాతో తీసికొని వెళ్ళితినో యానాటినుండియు నీమనస్సు చలించినది. అప్పుడా 'కొండయెలుకను' నీవు చూచియుందువు. చక్రవర్తిచే బందీయైయున్న ఆక్షుద్రమరాటుని ప్రేమపాశముల దగుల్కొని చచ్చుటకంటే సాక్షాత్ భారతచక్రవర్తి జ్యేష్ఠపుత్రుడును, విక్రమ సంపన్నుడునగు ముఆజమును వరించుట లెస్సగా దోచుటలేదా? ఆమహారాష్ట్రి మావంటివాడెక్కడ? రాజపుత్ర కన్య శైలిని యెక్కడ? నాయందవిధేయత, యింటివారియెడ యుదాసీన...'

'తండ్రీ! యేమంటిరి? శివాజి మహారాజు చక్రవర్తిబందీయైయున్నాడా?'

'లేదు, లేదు. శివాజి బందీయైయున్నాడని నేనంటినా! నీ విషయమై మనస్సు వ్యాకులత జెందియుండుటచే నిద్ర కన్నులతో అట్లంటినేమో' యని రాజసింహుడు మాట సరిచేసికొని యచట నుండి లేచిపోయెను.

శైలిని తండ్రిమాటలను మనస్సున మరల మరల విమర్శించుచు కన్నీటితో నిండిన కన్నులమూసి యటులనే నిద్రించెను.

౬

మహారాష్ట్రి శిబిరమునకు దినమున కనేకసారులు రాజసింహుడు పోయి శివాజి హితచింతకునివలె నటించుచుండెను. కాని శివాజి సర్వవ్యాపకబుద్ధి యౌరంగజేబు దుర్ణయమును గ్రహించియుండకపోలేదు. చక్రవర్తితో యుద్ధము చేసితప్పించుకొనుట పరమదుస్సాధ్యమని గుర్తెరిగి శివాజి మాయోపాయముచే నాతని వంచింప సమకట్టెను. శివాజి తన పరివారము నంతటిని తన దేశము పంపివైచెను. తా ననారోగ్యపీడితుడైనట్లు కొన్ని దినములు మంచముపై పరుండియుండెను. ఆరోగ్యము చేకూరుటకై పూజయొనర్చి ప్రతి గురువారమును మిఠాయీలను జనసమూహమునకు పంచిపెట్టజొచ్చెను. కోటనుండి తిరిగిపోవు మిఠాయిబుట్టలను కొన్నాళ్లు జాగ్రత్తతో పహరాదారులు పరిశోధించిరి. తరువాత యావిషయమై యుదాసీనతవహించిరి. ఒకనాడు సాయంకాలము భీముకాయ లిరువురు తమతలలపై పెద్ద బుంగల నిడుకొని కోటగుమ్మము దాటి బయటికి పోవుట వారుజూచిరి. కాని యంతకు ముందు పోయిన బుట్టలలో మిగిలియున్న మిఠాయిని వార్లు తీసికొనితినెడు తొందరలో వారిబుట్టల బరిశోధించలేదు.

సందేహగ్రస్తుడగు చక్రవర్తి మాయావియగు శివాజిపూజలలో నేదియో విశేషకృత్య మిమిడియుండునని పసిగట్టెను. అందుచే తన జ్యేష్ఠపుత్రుడగు ముఆజమును మిఠాయిగంపల పునఃపరిశీలనము జేయుటకై నియోగించెను. తండ్రియాజ్ఞను శిరసావహించుటకు యువకున కసాధ్యమయ్యెను. దానికి కారణములేక పోలేదు. సురాదేవి వీని శిరము నావహించియుండుటచే తండ్రియాజ్ఞ కచట స్థానములేకపోయెను. చక్రవర్తియాజ్ఞను మనఃపూర్వకముగా నీ సుపుత్రుడు పాలించియుండినచో భారతదేశచరిత్రము వేరొకరూపమును దాల్చియుండెడిది. శివాజి పూజాస్థలమునకు బయలుదేరిన యాతడు చుక్కానిలేని నావవలె యటునిటు తిరుగాడి రాజసింహుని మందిరమును రాత్రి తొమ్మిదిగంటలకు చేరుకొనెను.

మేడమెట్లనెక్కి ముఆజము వచ్చుట శైలిని చూచెను. ఈనాడాతడు సు

రాపానముచే మైమఱచి యుండుటయు, ఆతనివెంట తనతండ్రి లేకుండుటయు నామె చూచి యేదియో యుపద్రవము సంభవింపనున్నదని యెంచి రెండు చీరల నొకదానికొకటి ముడివైచి యొక కొసను స్తంభమునకుగట్టి మేడక్రిందికి జార విడువబడిన రెండవకొనవరకును జారి యాచీకటిలో యదృశ్యురాలయ్యెను. శైలినితో యేకాంతమున మాట్లాడి యామెను వశబరచుకొనుటకు రాజసింహునిచే సర్వస్వాతంత్ర్యములను బొందిన ముఆజము శైలిని ప్రేమను బలిమినైన బొందవలెననెడి యుత్సాహోద్రేకములతో తప్పత్రాగి వచ్చెను. పాప మాతనికోర్కె నెరవేరలేగు. హతాశుడై మరలిపోవలసి వచ్చెను.

శైలిని మహారాష్ట్రశిబిరమునకు పోవుచుండెను. మార్గమున చంద్రోదయమయ్యెను. చంద్రునిచూచి యామె యేమోమో యనుకొనుచు పోవుచుండెను. 'చంద్రుడా! అంత దయావిహీనుడవేల? రోహిణి నీకై దగ్గరకు వచ్చుకొలదిని నీవు దూరముగ మేఘముల తప్పించుకొని పారిపోవుచుంటి విదెట్టిన్యాయము? నా ప్రియుడు నీవలెనేయుండును. నీవలెనె సౌందర్యమూర్తి, సుధామయుడు, శాంతస్వభావుడు. ఛీ! ఈ సామ్యము బాగుండలేదు. నీకాంతి తగ్గునట్లాతని ప్రేమ యొకప్పుడు దినదినమునకును క్షీణించునా? రోహిణినుండి నీవు దూరముగ పోవుచున్నట్లు నన్ను జూచి నాప్రియుడు దూరముగ పోవునా? కాకున్నచో మొన్న గజారోహియై దర్బారునకు పోవునపుడు నా చెలికత్తెచే హారతి నంపి శైలిని పంపినదని తెలుపగా శైలిని యెవరని యేల యడుగవలెను? నన్ను గవాక్షమునుండి చూచియును గుర్తింప నట్లేల నటింపవలెను? మనసా! భ్రాంతి జెందకుము. నాప్రాణవల్లభుని ప్రీతి పర్వతమువలె అచంచలము. ఢిల్లీనగరమా! ఇక నిన్ను మరల ప్రవేశించను. నీధర్మాంధతకు, నీరాజతంత్రములకు, నీదుష్కార్య కౌశలమునకు నమస్కారము. హిందూస్వాతంత్ర్యము నపహరించి రాజపుత్రుల సువర్ణకారాగృహమైయొప్పు నీకు సేనధీశ్వరిని కాజాలను. అంతకంటె శివాజి దాసినై సుఖజీవితము గడపెదను.' ఇట్లనుకొనుచు శైలిని శివాజి శిబిరమును ప్రవేశించెను.

ముఆజము తన యంతఃపురమునకు తిరిగిపోవుచు, మార్గమధ్యమున నిలిచి, శైలిని మహారాష్ట్ర శిబిరమునకు పలాయనమైయుండునని యోచించి యాతడును శివాజిశిబిరముదెసకు మరలెను.

రాత్రి పదిగంటలైనను ముఆజము మహారాష్ట్రశిబిరమునుండి తిరిగి రాలేదని చక్రవర్తి యాతురపడజొచ్చెను. బోనునందు బిగింపబడిన 'పర్వతమూషకము' తప్పిపోయియుండునేమోయని యాతడనుమానపడజొచ్చెను. అట్లు సంభవింపనేరదని రాజసింహుడు చక్రవర్తితో చెప్పి తాను స్వయముగ విశేషముల దెలిసికొని వచ్చి విన్నవింతునని పలికి శివాజి శిబిరమున కాతడు బయలుదేరెను.

౫

'శైలినీ! నీవీ గంభీరనిశయం దిచ్చటికేల వచ్చితివి?'

తన ప్రియుని నోటినుండి వచ్చిన ఈవిపరీతప్రశ్న విని శైలిని యట్లే నిలచెను.

'ఏలవచ్చితివి? ఈశ్రమయేల?' యని మరల ప్రశ్న.

శైలిని స్వల్పధైర్యమునుగొని 'మీ క్షేమము విచారించుటకును, చక్రవర్తి కృత్రిమమును తెలుపుటకును' యనెను.

మహారాష్ట్రుడు 'సర్వమునూ కృత్రిమమే!' యని నిట్టూర్పువిడచెను.

శైలిని చలించుచున్న హృదయమును బిగియబట్టి 'మాతండ్రి యనాలోచితముగ చేసినకృత్యమును.'

మహారాష్ట్రుడు తనకన్నీటిని శైలినికి గానరానీయక 'అందరునూ యనాలోచితముగ పనుల జేయుదురు. నేనును, నీవును, ఎల్లరును' యని స్తబ్ధుడయ్యెను.

మహారాష్ట్రుని మాటలు శల్యములవలె శైలిని హృదయమున గ్రుచ్చుకొనెను. శైలిని వానిని సమీపించి 'నే ననాలోచితముగ చేసినదే'మనెను.

'న–న్ను–, న–న్ను, ప్రేమించుటయే. శైలినీ! నన్ను క్షమింపుము.' నన్ను మన్నింపుము! నేజేసిన యపరాధమును నోరార చెప్పలేను. ఈకాగితము నీకు పంపవలెనని యుద్దేశ్యముతో వ్రాసియుంచితిని. ఇదిగో దీనిని చదువుకొను' మని యొక కాగితము నామెచేతికిచ్చెను.

ఇంతలో పహరాదారుల నదరించి లోనికివచ్చి ముఆజము వారియెదుట నిలచెను. ఏకాంతగృహమును ప్రవేశించిన ముఆజమును చూచి మహారాష్ట్రుడుగ్రుడై ఖడ్గము నొరనుండితీసి వానిని దరిమెను. ముఆజము బయటికి పరుగెత్తుకొని వచ్చి పహరాదారుని తలుపు గడియ వేయునట్లాజ్ఞాపించెను. తత్క్షణమే తలుపు గడియవేయబడెను. ఒక కిటికీయూచల వంచి యావలికి మహారాష్ట్రుడు దుముక ప్రయత్నించుచుండెను. ఇంతలో రాజసింహు డచటికివచ్చి శివాజి ముఆజమును నరుకవచ్చెనని భటులవలన

ష్టిని యీశిబిరమునకు నిప్పుముట్టింపుమని యాజ్ఞాపించెను. నిప్పు తగులుటతోడనే యాకృత్రిమభవనమును మహాజ్వాలలు చుట్టుముట్టెను. ముఅజము ఖంగారుతో 'అయ్యో! అయ్యో! శైలిని లోపల యున్నది. ఆమెను రక్షింపుడ'ని యరచెను. రాజసింహుని కీమాట చెవినిబడుటతోడనే యున్మత్తునివలె 'అమ్మా, శైలినీ! తల్లీ, శైలినీ!' యని యరచుచు తనప్రాణములపై ఆశవీడి యామె ప్రాణములను రక్షించుటకు కాలుచున్న యాభవనమును ప్రవేశించెను. మరల తిరిగి రాలేదు. అది కృత్రిమభవనమాటచే యొక్క ఘడియలో భస్మావశేషమయ్యెను.

ఈవార్తవిని చక్రవర్తి యాతురతతో యాస్థలమునకు వచ్చిచేరెను. చక్రవర్తియాజ్ఞ ననుసరించి కాలిపోయిన మూడు శవములను సైనికులు బయటికి తీసి వానియెదుట పెట్టిరి. శైలిని పిడికిలి యందు మూయబడియుండి యచ్చటచట కొనలు కాలిన కాగితమొకటి వారికి గోచరించెను. అందిట్లుండెను.

* * *

'శైలిని,

నిన్నొకటి రెండుసార్లు ప్రేయసీ యని సంబోధించినందుకు క్షమించుము. నీవు నీతండ్రితో ప్రతాపగడ దుర్గమునకు వచ్చిననాటినుండి యీపాపబీజము నాహృదయమున వృద్ధిజెందినది. ఆనాడు పూలతోటలో నీ లావణ్యమునుచూచి ముగ్ధుడనై విరహిణియగు వనదేవతవలె ఉన్న నీతో ప్రేమసంభాషణచేసితిని. నేను శివాజినని మోసపోయి నీవు నన్ను ప్రేమించితివి. నాదేహము, రూపము, ఆకారము, వర్ణము, సర్వమును శివాజి రాజును పోలియుండును. ఏదేని ప్రమాదసమయమున శివాజి వారిస్థానమున నన్నిడి ప్రాణరక్షణ చేసికొనుచున్నారు. ఆనాడు దిలేరుఖానునితో వ్యవహరించినది నేను యుద్ధమున శివాజికి యేటు తగిలి శిబిరమునకు పోయినచో నేను రణరంగమున భటులకు ప్రోత్సాహ మొనర్చుచుందును. ఇంతేల? ఈనాడు శివాజి తప్పించుకొనిపోయి యితరుల కనుమానము దోపకుండునట్లు నన్ను వారి శయ్యపై బరుండియుండున ట్లాజ్ఞాపించి వెళ్ళిరి.

శైలినీ! బ్రహ్మహత్యకును, పత్నిహత్యకును ప్రాయశ్చిత్తమున్నది. స్వామిద్రోహమునకు ప్రాయశ్చిత్తమున్నదే? నేను నాజన్మపర్యంతము వివాహమాడనని శివాజిమహారాజెదుట శపథము చేసియున్నాను. నేను నిర్వహించు ప్రత్యేకరాచకార్యమున కట్లవసరమని రాజట్లు శపథము గైకొనెను. నేను స్వామిద్రోహిని! నిన్ను మోసపుచ్చితిని! వంచించితిని! నిన్ను పాణిగ్రహణ మొనర్చితినే కాని నీపరిశుద్ధదేహమును యపవిత్ర మొనర్పలేదు. శైలిని! నన్ను క్షమింపుము. నన్ను మరచిపొమ్ము, నీవెవరినిచూచి శివాజియని భ్రాంతిజెందితివో ఆపాపియగు యీ హీరోజి ఫర్జండ్ అను మహారాష్ట్రుని పూర్తిగా మరచిపొమ్ము. నన్ను మరచుటయే నీవు నన్ను క్షమించుటయని నేను భావింతును.

హీరోజి ఫర్జండ్.

* * *

ఔరంగజేబు చక్రవర్తి యీలేఖను విని కుపితుడయ్యెను; దుఃఖితుడయ్యెను. శివాజి తప్పించుకొనిపోయెనను కోపము- రాజసింహుడును, శైలినియు ఘోరమృత్యువుబారి బడిరని దుఃఖము.

# వింతమానసి

“మహేశ్వర్”

ఆమె ఎంత శ్రావ్యంగ పాడుతూందో! అతనికి వినబడలేదూ? ఎప్పుడూ ఏదో బాధ? అందరూ హేళన చేస్తారతన్ని! ఎవరూ అతనితో మాట్లాడరేం? శరీరంలో బలంలేదు! హృదయంలో శాంతిలేదు! ‘శరీర మిలా శుష్కిస్తూందేం?’ అని ఎవరూ ప్రశ్నించరేం? లోకానికి అతను అక్కర్లేదూ? ఆ ఎముకలు ఎలా అగుబడుతున్నై! నరాలు నాట్యంచేస్తున్నై!

ఎక్కడికో వెళ్ళిపోతాడు ఎండలో! ‘వెన్నెలం’టాడు! వర్షంతో ఇల్లు చేరుకుంటాడు!

‘పన్నీటిజల్లు’ అంటాడు.

‘దేశదిమ్మరి’ అంటుంది నోరున్న గుడ్డిలోకం!

* * *

ఆయ నెలా జీవిస్తున్నాడు?

అడగడ నికి ఎవరికైనా సానుభూతివుందా?

ఎప్పుడైనా తిండి తింటాడా?

మరెలా జీవిస్తున్నాడు??

ఎందుకలా తిరుగుతున్నాడు???

మనశ్శాంతిలేక! అంతేనా!ఆఁ..

* * *

బ్రతికి చెడ్డ రోజులు!

బంధువులంతా బారలావల వున్నారు. ప్రయోజనం...?

అంతా తిడ్తారతన్ని! ఎంతని సహించగలడా జీవి!

ఎప్పుడూ ఏదో వ్రాస్తూ కూర్చుంటాడు. తననే చిత్రించుకుంటాడు.

‘ఆకలీ’ అంటాడు.

‘కన్నీరు కావాలోయ్’ అంటాడు!

‘ఎడారి ఒంటె’ అయిపోతాడు.

స్వేచ్ఛావిహారం అతని వాంఛ!

‘ప్రేమగీతాల్ని’ ఆలాపించాలంటాడు. తన తండ్రి మంచంమీద ఉన్నాడు. [లేదు!

మందులేదు! మారు - దిక్కు-

డాక్టర్ని పిలిస్తే?

డబ్బివ్వందీ ఆ ‘హేట్’ రానన్నాడు. ‘బుట్ట’లో పడాల్సిన అతన్ని ఒకప్పుడు ఈయనే రక్షించేడు.

యిదీ కృతజ్ఞత! కృతఘ్నత!!

* * *

దైవకృపవల్ల ఆగండం గడిచి బయటపడ్డారు.

పూర్వపు ఇల్లే మారిపోయింది; ఆ యింట్లో...ఆయన డాక్టరు. ఎన్నిమార్లు చెప్పుకున్నా రాడే! డాబామీద పేకాట!

ఈతని దురవస్థకి దురపిల్లి ప్రకృతి వగచింది.

నాల్గుచుక్కలు రాలాయి!

ఈత డక్కడ ఉండలేక పోయాడు. అతన్ని వెతక నెవ్వరూ వెళ్ళలేదు!

ఆతల్లి ఎంతో పరితపించింది అతని వియోగంకి. ‘ఎందుకు వెళ్ళిపోయావ్?’ ఏమీలేదు! జలజలా కన్నీరు కారింది. అంతే!

‘పిచ్చిబాబు’ అన్నారు.

* * *

ఉన్న స్నేహితుల్లో ఉత్తముడు ఊరువిడచి పోవాల్సొచ్చింది.

మూడు నెలలకో లేఖ చేరిందీతనికి ‘నారాత బాగులేదుకదూ!’ అని! అతడు వచ్చాడు. దినాలు గడచిపోతున్నై. ఇలాగెన్ని?

‘నేను జీవించి ఎందుకూ?’ అంటాడు.

‘ఎందుకా? దేశక్షేమానికీ! లోక కళ్యాణానికీ! మానవ అభ్యుదయానికీ!’

అంతా తిడ్తారే పిచ్చిబాబని!

అతని రచనలు తూలనాడ్తారే! ఎందుకు? అర్థం గాక!

అతని జీవితపథంలో పంటలు లేవు!

అందుకే అతనికి ఆకలి మంటలు!

అవే లోకానికి గంటలు!

అందరి హృదయాల్లో మంటల గంటలు!

ఓ చిన్న ఉద్యోగం దొరికింది.

అదీ ఆనందపరచలేదు!

పూర్వపు ధోరణే!

‘ఆశ’ అనేది ప్రపంచంలో ఇక ‘నిరాశే’ అన్నాడు.

‘కన్నీటికెరటాల్లో’, ‘మంటల నావలో’, ఒంటరి ప్రయాణం!

బయల్దేరిపోయా డెక్కడికో!

ఎక్కడికెళ్ళినా ఏదీ శాంతి?

తిరిగివచ్చి, తిరుగ వెళ్ళేడు.

తండ్రితో దేశాంతరం!

అచట ‘శాంతిస్థాపన’ చేసుకుందామని! ఎవ రతడు?

“వింత మానసి!”

# ఆ నా డు జూ ద మా డా లి

## మహారాష్ట్రులు : ఆశ్వయుజపూర్ణిమ

## కోజాగరీవ్రతమాహాత్మ్యం

ఆశ్వయుజమాసపు పూర్ణిమనాడు మహారాష్ట్రులు కోజాగరీవ్రతాన్ని జరుపుతారు. ఈ వ్రతం ఆంధ్ర దేశంలో అంత ప్రచారంలో లేదు. ఐనా అక్షక్రీడకు అనుమతిగల ఈ వ్రతాన్నిగురించిన సంగతులు తెలుసుకోడానికి చమత్కారంగా వుండగలవు. —సంపాదకుడు.

లక్ష్మీదేవికి, శ్రీరామునికి ప్రియమైన వ్రతమిది. అశ్వయుజమాసపు పూర్ణిమనాడు ఈ వ్రతం జరుపుతారు.

ఆనాటి అర్ధరాత్రివేళ లక్ష్మీపూజ చేస్తారు. ఆహ్వానించిన అతిథులకు కొబ్బరికాయలోని పాలుపంచి పెడతారు.

ఈనాడు అక్షక్రీడ (జూదం) ఆడడానికి శాస్త్రాలు అనుమతిస్తాయి. అనుమతించడమేకాదు తప్పక ఆడవలసిందిగా విధిస్తాయి. ఈనాడు అక్షక్రీడ ఆడడం భాగ్యవర్ధకంగా చెప్పబడుతుంది.

చుట్టాలతో, స్నేహితులతో కలసి ఈరాత్రి అక్షక్రీడ ఆడుతూ రాత్రిపొద్దుపోయేవరకు మేలుకుని వుండడము పుణ్యప్రదమని ప్రజలనమ్మిక. ముఖ్యముగా ఈరోజున అక్షక్రీడ మిక్కిలి పేదవడ్డవారికి విధింపపడింది. అట్టివారు అక్షక్రీడ ఆడితే రాముడువారిని అచిరకాలంలోనే భాగ్యవంతుల్ని చేస్తాడట !

ఆశ్వయుజమాసపు వ్రతాల్లో విశేషభాగ్యప్రదాయిని ఐనవ్రతం ఏమిటని వాలఖిల్యఋషిని ఇతరఋషులు ప్రశ్నించారు. ఆప్రశ్నకు సమాధానంగా వాలఖిల్యుడు కోజాగరివ్రతాన్ని పేర్కొన్నాడు. ఆవ్రతప్రాశస్త్యాన్ని నిరూపించడానికి వాలఖిల్యఋషి ఈక్రింది వృత్తాంతాన్ని చెప్పాడు.

మగధదేశంలో వలితుడనే ఒక పేదబ్రాహ్మడు. అతడు పవిత్రశీలుడు, గొప్పశిక్షకుడు.

అతనికి చండిని అను పేరిదిభార్య. ఆమెగయ్యాళి. తనకు మంచి మంచి ఆభరణాలు, వస్త్రాలు ఈయలేకపోయినందుకు ఆమెమగణ్ని అస్తమానూ ఆడిపోస్తూవుండేది.

లక్ష్మీదేవి తమకు భాగ్యం యిచ్చేవరకు తాను మగడు చెప్పేదానికి వ్యతిరేకం చేస్తూవుంటానని ఆమె ఒకసారి వొట్టుపెట్టుకుంది.

వలితుడికి గణేశశర్మఅని ఒకస్నేహితుడువున్నాడు. వలితుడు విచారగ్రస్తుడై వుండడాన్ని శర్మచూచి అతని విచారానికి కారణం అడిగాడు. నిజం చెపితే అతన్నికష్టంనుంచి గట్టెక్కిస్తానని కూడా చెప్పాడు.

అందుమీద వలితుడు తనభార్య ప్రతిజ్ఞ తనఅవస్థ శర్మతో చెప్పుకున్నాడు.

‘ఆమె ప్రతిజ్ఞ ఎప్పటికేనా నీకు భాగ్యం సంపాదించడానికి ఉద్దిష్టమైనదే కాబట్టి అంతగా విచారింపవలసిందికాదు. మీదు మిక్కిలి సంతోషింపవలసింది. నీకు ఆమె చేత ఏపనిచేయించాలని వుంటుందో దానికి వ్యతిరేకమైనపని ఆమెతో చెబుతూవుండు. దానితో నీసంకల్పం నెరవేరుతూవుంటుంది.’ అని శర్మ ఉపదేశంచేశాడు.

ఆ ఉపదేశానికి శర్మకు కృతజ్ఞత తెలిపి వలితుడు ఆప్రకారం తనభార్యతో కాపరంచేస్తూవచ్చాడు.

ఇంతలో వలితునితండ్రి తద్దినంవచ్చింది. శర్మ ఉపదేశంప్రకారం వలితుడుభార్యనుపిలిచి తనతండ్రి తనకు ఏమీఆస్తి ఈయకుండా చనిపోయిన కారణంచేత అతనితద్దినం తానుపెట్టేదిలేదనీ—కాదూ కూడదు పెట్టకతప్పదనీ అతడంటే ఏదోచదువురాని బ్రాహ్మల్ని భోక్తలుగా పిలవవలసిందనీ- వారికైనా అకాలంలోకాని భోజనంపెట్టవద్దనీ అన్నాడు.

మగడుచెప్పినదానికి వ్యతిరేకంగా చేయడమే ఆమెతలపు కాబట్టి చండిని చదువున్న మంచి బ్రాహ్మల్ని పిలిచింది. యథాకాలంలో యథాశాస్త్రీయంగా వారికి భోజనంపెట్టింది.

ఈపనికి వలితుడు లోపల లోపల ఎంతో సంతోషించాడు. ఆసంతోషంతో పరవశుడై భార్యతో మాట్లాడే

తీరుమరిచిపోయి పిండాల్ని నదిలోపడవేయమన్నాడు. మగడు చెప్పినదానికి వ్యతిరేకంగా చేయడమే ఆమెవ్రతం కాబట్టి చండిని ఆపిండాల్ని నదిలో వేయక ఒక మురికిగుంటలో వేసింది.

అదిచూచి వలితుడు భరింపలేక పోయాడు. కాగా విసిగి వేసారి ఇల్లువదలి పోయాడు. లక్ష్మి తనమీద దయపెట్టి తనకు భాగ్యంఇచ్చేవరకు తాను ఇక అన్నంముట్టనని అతడు ప్రతిజ్ఞ పట్టాడు.

ఆమీద అడవికి పోయాడు. చెట్టుపట్టలు బట్టలుగా ధరించాడు. ఫలాలు తిని ప్రాణాలు నిలుపుకునేవాడు. ఇట్లా జీవయాత్రచేస్తూ అతడు ఆఅడవిలో నడిచిపోతున్నాడు. ఇంతలో అతడు ఒకనదీతీరాన్ని చేరాడు. అక్కడ అతను ఇరవై రోజులువున్నాడు. అతడు అక్కడ వుండగానే ఆశ్వయుజపూర్ణిమ వచ్చింది.

ఆనాడు అక్కడికి ముగ్గురు నాగకన్యలువచ్చి రాత్రివేళ లక్ష్మీపూజ చేశారు. పూజ అయిన పిమ్మట వారు అక్షక్రీడ ఆడడానికి ఆయత్తపడ్డారు. ఆటకు నాలుగో మనిషి లోటు. నాలుగోమనిషికోసం వెతుక్కుంటూవున్న నాగకన్యలకు మనపేదవలితుడు కనిపించాడు.

అక్కడ ఒంటరిగా కూచోడానికి ఏమిటి హేతువని అతణ్ణి అడుగుతూ వారు అక్షక్రీడకు రమ్మని పిలిచారు. అక్షక్రీడ ఆడినందువల్ల తప్పక భాగ్యం వస్తుందని వారుచెప్పారు.

జూదం వ్యసనమని పెద్దలు చెప్పివుండడాన్ని అతడు ఆనాగకన్యలకు చెప్పాడు. అందుమీద నాగకన్యలు పెద్దపండితుడుగా మాట్లాడుతూ ఆచరణలో మూర్ఖుడిగా వున్నందుకు అతణ్ణి గేలిచేసి ప్రతిసూత్రానికి ఒక మినహాయింపు ఉందనీ, సంవత్సరానికంతటికీ ఆనాడు అక్షక్రీడకు శాస్త్రీయమైన అనుమతి పొందిందనీ అతనితో చెప్పారు.

మారుమాటచెప్పక తాము చెప్పినట్లు చేసి దానిఫలితాన్ని పరీక్షించుకోవలసిందిగా నాగకన్యలు వలితుణ్ణి ఆజ్ఞాపించారు.

అప్పుడు అతడు వారితో యక్షక్రీడ ప్రారంభించాడు. మూడుసారులు ఓడిపోయాడు. ఆఓటములతో అతనికి ఉన్న ఆస్తి అంతా—పంచి, కౌపీనం, యజ్ఞోపవీతం—పోయింది.

అర్ధరాత్రి ఐంది. అప్పుడు లక్ష్మీనారాయణులు భూలోకసంచారానికి బయలుదేరారు- ఆరాత్రి నిద్రపోకుండా అక్షక్రీడలో పర్యాప్తులైవున్న అదృష్టవంతులు ఎవరో చూద్దామని. కట్టుబట్టల్ని కూడా కోలుపోయిన ఆపేదబ్రాహ్మణ్ణి వారు చూశారు.

వారికి జాలిపుట్టింది. కాగా అతనికి మంచియౌవనము, రూపము ఇచ్చారు. ఇచ్చి అతన్నివివాహం ఆడవలసిందిగా నాగకన్యలకు చెప్పారు.

అప్పుడు నాగకన్యలు జాదంలో తాము జయించేకల్పంలో అట్లే చేస్తామనీ, ఒకవేళ అతడే జయిస్తే తమ్ము అతడు తనఇష్టంవచ్చినట్లు చేయవచ్చునని చెప్పారు.

ఎల్లాగున ఐనా వారు తనభార్యలే అవుతారనే ధైర్యంకలగడంచేత బ్రాహ్మడు మంచిఉత్సాహంతో అక్షక్రీడ ఆడాడు. ఈసారి ఆటలో అతనికి జయం వచ్చింది.

అప్పుడు అతడు గాంధర్వవిధిని వారిని వివాహమయ్యాడు. ముద్దిసిసు ఆహారపదార్థాలతోటి వారు అతనివెంట అతని ఇంటికివెళ్ళారు. అతడు పూర్తిగా మారిపోయి భాగ్యవంతుడై వచ్చాడు కాబట్టి చండిని ఇప్పుడు అతనికి బారలు చాపి స్వాగతం ఇచ్చింది. శ్రీపతి దయవల్ల అతనికి ఏవిషయంలోను చీకుచింత లేకపోయింది.

ఈవెన్నెల రాత్రి మహారాష్ట్రులు తీసుకునే ఆహారం పాలల్లో నానవేసిన అటుకులు; పూరీలు; వంకాయి, ఉల్లిపాయి, అరటికాయ మొదలయిన కాయల ముక్కలు మినపపిండిలో పొదిగి నూనెలోకాని నేతిలోకాని వేయించబడ్డ బజ్జీలు.

ఆశ్వయుజ పూర్ణిమనాటి రాత్రి లక్ష్మి భూమిఅంతా కలయతిరుగుతూ ప్రతి ఇంటివద్ద పిలుస్తుందట. కాబట్టి ఈనాటి రాత్రి ప్రతివారు కనీసం అర్ధరాత్రిఅయ్యేవరకైనా మేలుకుని వుంటారు.

అర్ధరాత్రివేళ లక్ష్మి వచ్చి ప్రతి ఇంటివద్ద ఎవరు మేలుకునివున్నారు ('కోజాగరీ') అని అడుగుతుందట. ఎవరూ పలక్కపోతే చల్లగా వెళ్ళిపోతుందట. అందుమీద ఆయింటికి లక్ష్మీప్రసన్నంలేకుండా పోతుందట.

ఈనాడు స్త్రీలు పొంగుచేయగలిగినన్ని పాలు పొంగుచేస్తారు. పంచదార, ఏలకపొడి,కుంకుమపువ్వ వేసి క్షీరాన్నం వండుతారు. ఉడికిన తరువాత అది కొంతసేపు వెన్నెల బయలున వుంచుతారు.

ఇల్లా వుంచడంచేత చంద్రకిరణాల ద్వారా అమృతంవచ్చి అందులో పడుతుందని వారి నమ్మిక. ఆమీద ఆక్షీరాన్నాన్ని అందరికీ పంచిపెడతారు.

రాత్రి జాగారం చేస్తారు.

నిఘంటువుల్లో దొరకని విశేషార్థాలు : ౨.

# 'నియంతృత్వం'

[వినోద వ్యాసం]

'నియంతృత్వం' నిత్యకృత్యాల్లోనూ, రాజకీయాల్లోనూ అది లేకుంటే అడుగు కదలదు.'

రచయిత :

## 'శ్రీహరి'

—'నాన్ కోఆపరేషన్'
—'నో-కాన్ఫిడెన్సు మోషన్'
—'వాకవుట్'
—'సత్యాగ్రహం'
—'నిరశన వ్రతం'
—'నియంతృత్వం'

ఇట్లా-ఎన్నో పదాలు! ఎన్నెన్నో పదాలు!!—పాతవే కావచ్చునేమో, కాని కొత్త స్వరూపంతో - కొత్త ఉత్తేజంతో ఈనాడు మళ్ళీ కలకల్లాడుతూ కులుకుతున్నాయి. పునః ప్రాణ ప్రతిష్ఠ జరిగి ఇవి అమల్లోకి రావడం మాత్రమే కాదు. పల్లెపట్టులకు సైతం పాకిపోయాయి. ఇంటింటా అలుముకున్నాయి. సాంసారిక నిత్యకృత్యాల్లో 'మేమూ మీతోపాటే' అని చెప్పి అస్తమానమూ తల సూపుతున్నాయి.

... ... ...

మచ్చుకి, చూడండి !— దంపతుల మధ్యని జరుగుతూవున్న 'సత్యాగ్రహా'ల్ని గురించి ఈ మధ్యని ఎంతగానో వింటూవచ్చాం. పరీక్షకు పంపకుంటే విద్యార్థులు 'సత్యాగ్రహం' చేయటం పరిపాటిగా పత్రికల్లో చదివాం. చివరకు-శాంతా ఆప్టే వంటి చదువుకున్న విదుషీమణికూడా 'సత్యాగ్రహ' జాడ్యానికి గురి అయి; 'నిరశన వ్రతాన్ని' నిరాటంకంగా సాగించిందంటే, ఈ పదం ఎంతటి మహిమాన్వితమైందో చెప్పతరమౌతుందా ?

... ... ...

పైని పేర్కొన్నవాటిల్లో కడగొట్టు పదం 'నియంతృత్వం.' ఈ పదం—గాంధీ వుద్యమం బయల్దేరిన ఈ ఇరవై యేళ్ళనించీ, రాజకీయ వాతావరణంలో నలిగి పచ్చడవుతూన్నదే. ఫలానావారు వలంటీరు దళానికి 'నియంత' అనే వాడకంతో ఈ పదానికి విశాలభావోదయం కలిగిందని చెప్పవచ్చు. ఇది భారతీయులు సాగిస్తూవున్న 'శాంతి స్వాతంత్ర్య సమర' సందర్భంలో ఉపయోగింపబడిన పదం.

... ... ...

ఇదే పదం--సరిగ్గా ఇదేపదం--ఇటీవల యేడాదినించీ ప్రళయ భీకరంగా సాగిపోతున్న ఐరోపామహా సంగ్రామ సందర్భంలో కూడా గూబలు బద్దలయ్యేట్టు ఘోషిస్తూనే వున్నది. హిట్లర్ నియంత, ముస్సోలినీ నియంత—అంటే యేమిటో సమంగా అర్థం తెలియకపోయినా, కసుగాయలకూడా అర్థం తెలిసినట్టే వుంటుంది!

... ... ...

'పసగురాదు మాట పాటియై ధర జెల్లు' అని వేమనయోగి నిర్వచనం. దీనికే రాచకీయార్థం ప్రజాస్వామిక పాలనం,' లేదా 'డెమొక్రసీ.' అంటే మన కాంగ్రెసు రాజరికంవంటి దన్నమాట. సరే, ఇంత వరకూ బాగానే వుంది.

మళ్ళీ ఆ వేమన్నే 'ఒక్కడాడు మాట యెక్క దెందు' అన్నాడు- ఊహు. ఈ సిద్ధాంతంతో పూర్తిగా యేకీభవించలేము. 'ఒక్కడాడు మాట' మాత్రం ఎందు కెక్కదూ? ఎక్కుతుందని ఈనాడు హిట్లరు, ముస్సోలినీలు ప్రత్యక్షంగా రుజువు చేస్తూన్నారు కాదూ? ఒక్కడిమాట యెక్కే సందర్భాన్నే మాటవరసకి మనం 'నియంతృత్వం' అని అనుకుందాం.

... ... ...

ఈ 'నియంత' పదానికి గల పూర్వాపర సందర్భాలు తెలుసుకోవాలంటే, పాతచరిత్రలు కాస్తంత తవ్వక తప్పదు.

పురాతనపు రోమకమహా సామ్రాజ్యం వైభవంతో తులతూగే నాటి కాలంలో—రిపబ్లిక్ పాలన వుండేది. అప్పుడు—సుప్రీమ్ మేజస్ట్రేట్సుకు అత్యవసర సమయంలో ఆరు నెలల పాటు సర్వాధిపత్యాలూ ఇచ్చేవారు. అనగా ఆ ఆరుమాసాలూ ఆ అధికారి నిరంకుశు డన్నమాట.

తదుపరి- క్రూరంగా వ్యవహరించే గ్రీకు ప్రభువులకు 'నియంత' లనే పేరు వర్తించింది.

అటుతరువాత- పారస్యే, దక్షిణ అమెరికాలోని నిరంకుశ పాలకులందరకూ క్రమేణ 'నియంత' అనే పదం అన్వర్థనామంగా అంకిత మవుతూ వచ్చింది.

... ... ...

డిక్టేటరు పదాన్ని పురస్కరించుకునే-'డిక్టేటోరియల్' అంటే క్రూరమయిన- గర్వమైన- అహంకారమైన- మొదలగు క్రియావాచకాలు పుట్టుకొచ్చాయి. అందుకనే ఒక్కడిమాట చెలామణి అవుతున్నదనే కారణంచేత హిట్లరు, ముస్సోలినీల పట్ల క్రూరులు, అహంకారపూరితులు—ఇత్యాది విశేషణాలూ ఆలంకారికాలూ వినియోగపడుతున్నాయి.

... ... ...

విదేశ చరిత్రలు సామ్యం తెచ్చుకోవడంకంటె, మన చరిత్రల్లోనించే ఒకటి రెండు సాదృశ్యాలు ఏరుకుంటే హృదయానికి బాగా హత్తుకుంటుం దనుకుంటాను. అదీ చూదాం:

మనిషియొక్క మంచి చెడ్డలు తెలుసుకోవాలంటే చేతికి డబ్బివ్వడమో, సరసను యువతిని కూర్చోపెట్టడమో, లేదా అధికారం నియోగించడమో—ఇటువంటి దేదో జరగాలి.

ద్రోణుడివంటివాడు అర్థంకోసం ద్రుపదుడికి చెయిజాపవలసి వచ్చిందంటే, డబ్బు ప్రభావానికి లొంగనివాళ్లు అరుదుకదా. అని గ్రహించగలం.

గాధినందనుడి వంటి ఘటికుడూ, తపశ్శాలీ మేనకను చూచీ చూడ్డంతో మీదపడ్డాడంటే కాంతాసక్తతను నిగ్రహించగల పురుషు డుంటాడా అనిపిస్తుంది.

ఇక, అధికారదుర్వినియోగం జరిగిన పౌరాణిక ఘట్టాలు కావాలంటే వందలూ, వేలూ ఉన్నాయి. అట్లా అని దుష్టవ్యక్తులుగా కేటాయించబడిన వారి మాట కాదు నే చెప్పేది. లోకైక పూజ్యులైన మహనీయులనే 'నియంతలు'గా నిరూపిస్తాను.

... ... ...

లక్ష్మణుడు :

ఈ క్రూరకృత్యం జరిపించాల్సిన విధి నాకు రాసిపెట్టాడా, మాయ దేముడు!- అన్నయ్యా, నా మనవి పాలించరూ? మళ్ళీ యోచించరూ?

శ్రీరాముడు :

లక్ష్మణా! నా మాటకు తిరుగు లేదని తెలియదూ? వెళ్తావా, లేదా?—

—గుడ్ల నీళ్లు గుక్కుకుంటూ, మారు మాటాడకుండా సీతా అమ్మవారిని తీసుకుపోయి అడవుల్లో వదిలేసి వచ్చాడు లక్ష్మణుడు.

... ... ...

భీముడు :

అన్నా! ఈ సమయంలో మీరు అడ్డుపెడితే కాదు. అనుజ్ఞ ఇవ్వండి. ముందు ఆదుష్టుడి ఊరువులు చీరిస్తే కాని నాకు నిద్ర పట్టదు.

అర్జునుడు :

నా గాండీవానికి బలే పని తగిలింది. ధర్మజా! తమరు 'ఊఁ' అంటే చాలు, శత్రువర్గాన్ని ఏరి

షార వేస్తాను.

నకులుడు : సహదేవుడు :

భ్రాతృవరా! ఆజ్ఞకోసం వేచి ఉన్నాం. మమ్మల్ని విడవండి. చూతురుగాని ప్రతాపం.

పాంచాలి :

ఇంతమందీ వుండి ఇటువంటి సమయంలో చేతగానివాళ్ళలాగ చూస్తూ వూరుకుంటారేం? ఒక్కళ్ళకూ మగతనం లేదూ!...

అందరూ :

[ఉరకలు వేస్తారు.]

ధర్మనందనుడు :

ఉండండోయ్, వాజమ్మల్లారా! ఇది సమయంకాదు.

... ... ...

మాటకు తిరుగులేని సర్వాధికారం చెలాయించగల ఏకైక వ్యక్తి పూర్వకాలంలో 'పోప్'—అంటే మతాధికారి. ఆయన దేవునితరవాత దేవుడంతటివాడు. క్రైస్తవ ప్రపంచమంతా ఆయన నోటిమీదనే పరిపాలింపబడేది. ఆ పరిపాలన ఎంత నిరంకుశంగా వున్నా పోప్‌ను భక్తితో పూజించారే కాని, ఆయనపట్ల 'నియంత' అనే ఘాటయిన మాటను ఎన్నడూ ఉపయోగించలేదు.

... ... ...

ఈనాడు కాంగ్రెసు మహాసభ భారతదేశీయులందరి తరఫునా ప్రాతినిధ్యం వహించి పాలనకు పూనుకోగానే, వారికి 'కాంగ్రెసు హైకమాండ్' అనే ఘనమయిన బిరుదు తగిలించారు ప్రజ. ఆ 'హైకమాండు'కు సారధి ఐనటువంటి గాంధి మహాత్ముణ్ణికూడ 'నియంత' అనడానికి సాహసించారు మన దేశీయులు.

... ... ...

ఒకరు చెప్పడం- ఒకరు వినడం—అంటే పాలక పాలిత శబ్దాలు నిఘంటువుల్లో నించి నిర్గమిస్తే తప్ప, చెప్పేవాళ్లు ఉన్నంతకాలమూ ఈ 'నియంత' పదం అమల్లో ఉండక తప్పదు.

... ... ...

మన మహర్షులు డబాయింపుతో, నోటి బూకరింపుతో వారి వారి కార్యాలు చక్కబెట్టుకున్నట్టు అనేక దృష్టాంతాలు అగపడతాయి. మాటవరసకి మళ్ళీ మన విశ్వామిత్రుడినే తీసుకుందాం: 'రామలక్ష్మణుల్ని యాగరక్షణార్థం పంపుతావా, లేదా?' అని మంచిగా అడిగినంతసేపూ దశరథుడు యేవో సాకులు చెప్పుకుంటూనే వచ్చాడు. కన్నెర్ర జేసేసరికి ఆమారాజు దాసోహమన్నాడు.

... ... ...

ఇదేమోస్తరుగా- దుర్వాసులు మొదలైన ఋషిపుంగవులందరూ కోపం చూపి, శపిస్తామని బెదిరించి, తమ తపఃప్రభావాన్ని దుర్వినియోగం చేసి, 'నియంతృత్వం' వహించారు. నిమిత్తమాత్రమైన వారి నిరంకుశత లోకకల్యాణం కోసమే కావచ్చు. కాని వారు నియంతలుగా వ్యవహరిస్తేగాని కార్యసాఫల్యం కాలేదన్నమాట సత్యం.

... ... ...

ఈనాడు- ఋషితుల్యుడయిన గాంధిమహాత్ముడుకూడ మన పౌరాణిక ఋషుల పొంతనే పోయాడు. ఈ మాటను దృఢీకరించటానికి అనేకసంఘటనలతో పాటు మొన్న మొన్నటి 'రాజకోటగలభా' జ్ఞప్తికి తెచ్చుకుంటేసరి. తన పట్టు నెగ్గడంకోసం ఆడదానిలాగ అన్నం తిన్నని కూచున్నాడు మహాత్ముని వంటివాడు. ఇంతా చేసి ఆ పట్టు పంతం నిలవనేలేదు. అయినా, 'నియంతృత్వం' ఇక్కడ అమోఘంగా పనిచేసింది.

... ... ...

వామనుడికి బలిచక్రవర్తి దానం చేయకుండా శుక్రాచార్యులు అడ్డుపడ్డట్టుగా, ఆంధ్రరాష్ట్రం విషయంలో రాజాజీ అడ్డుతగుల్తున్నాడనే అపోహతో ఆయనక్కూడా 'నియంత' అనే బిరుదు వొకటి పారవేశారు ఆంధ్రులు.

... ... ...

ఇంతెందుకూ—మనం పరిశీలనగా గుర్తించంగానీ, నిత్య జీవితంలో ఈ 'నియంతృత్వం' అగోచరంగా అమల్లో వుంటూనే వుంది.

కుటుంబంలో--ఒక్కొక సమయాన్ని పుచ్చుకుని ఒక్కొకరికి 'నియంతృత్వం' దఖలుపడుతుంది. కొడుకులు నలుగురూ తండ్రిమాటను శిరసావహించినంతవరకూ

తండ్రిని 'నియంత'గా మనం ఎంచవచ్చు. కాని, వాళ్లు దుండగీళ్ళయి ఎదురుతిరిగే పక్షంలో మటుకి ఆతడు తన 'నియంతృత్వా'నికి నీళ్లువదులుకోవలసిందే.

... ... ...

పెళ్ళినాడు పెళ్లాం తలవంచుకోవడంతో తన 'నియంతృత్వం' శాశ్వతమే అనుకుని భ్రమపడతాడు వరుడు. తీరా, నాలుగు కాయలు కాసి, పిల్లకు సంబంధం నిశ్చయించవల్సిన ఘట్టం వచ్చేసరికి తన 'నియంతృత్వం' భార్యకు ట్రాన్స్‌ఫర్ చేయడం తప్పనిసరి అవుతుంది.

... ... ...

ఇంతకీ—ఒక్క పరమసత్యం గ్రహించుకున్ననాడు ఈ నియంతల చర్యలకుగాని, నియంతృత్వం యొక్క విస్తృత ప్రభావానికి కాని మనం అబ్బురపడ పనివుండదు. యేమిటీ అంటే :

ఎవరేం చేసినా ఆ జగన్నియంత లీలలకోసమే. ఆ ప్రభువు అనుజ్ఞ లేనినాడు, కావాలన్నా మన 'నియంతృత్వం' సాగిరాదు. 'నియంతృత్వం' నిత్యకృత్యాల్లోనూ, రాజకీయాల్లోనూ ఒక ముఖ్యాంగం. అది లేకుంటే అడుగు కదలదు.

'నియంత'పదవి అదృష్టంకొద్దీ అబ్బుతుంది.

అది లభ్యమైన అదృష్టవంతుల్ని చూచి అసూయపడడం కూడని పని.

# హృదయపరివర్తనం

[౫౨-వ పేజీ తరువాయి]

(మంత్రివీపు నిమిరి) విశ్వమానవకళ్యాణం- దేశసౌభాగ్యం- శాంతి, ప్రేమ- అంటే,- నీబిడ్డల్ని- బంధువులని- తమ్ములను, ప్రేమించిన హృదయంతో, తోడి సోదరమానవులను ప్రేమించు-! అప్పుడే, విశ్వమానవ సౌభ్రాతృత్వం-జీవుల యెడ దయ యేర్పడుతుంది- మధురమయిన ప్రకృతిలోని- నిర్మల తేజస్సు హృదయాని 'కత్తుకొంటుంది—పరమాత్మగూడా- మనల్ని ప్రేమిస్తాడు!—పిల్లలకు, భార్యలకు- కాకుండా, యింతమందిని చంపి యుద్ధంలో జయించడం గొప్పకాదు—తన్ను తాను జయించుకోవడమే, అదృష్టం!- దేశం యీ యుద్ధవ్యాధులితోనూ!- బంధుమిత్రుల మరణశోకంతోనూ!- అరాజకంగావుంటే,- మనం జయించామనీ, గెలుపొందామనీ, సంతోషందేనికి?— నీబంధు పుత్రాదులకు, యీయుద్ధంలో మంచిగాయాలు తగిలితే- నీహృదయం యెంత ఆరాటపడుతుంది?- అంత దూరందేనికి, నీహస్తమే- యీ యుద్ధంలో తెగిపోతే,- నీమనస్సెంత బాధపడుతూంది?— అటువంటివి కావూ వారి హృదయాలు! అదే ప్రతిమానవుడిహృదయంలోనూ, కలగాలని ఆశిస్తాను!- అటువంటి నిర్మలమయిన ప్రేమ కలిగిననపుడే— 'దేశకళ్యాణం, శాంతి' ఏర్పడుతాయి!

మంత్రి :

ప్రభూ!- యీరోజు నిజంగా, యెంతసుదినం! తమ ప్రబోధన వల్ల- నామనోనేత్రం, తెరవబడింది—సాంప్రమాట్! తమ హృదయ పరివర్తనకు, ప్రపంచమంతా- ఆనందగీతికలు ఆలాపన చేస్తాయి.

బయట సాధువు :

('ప్రేమమమే' - అనుమాదిరి)

శాంతి, మయ మే - జీవములూ !
త్యాగమయమే భోగములూ-
జీవుల నన్నిటి - ప్రేమమయము గా-
జూచెడివారే - ధన్యులూ !- శాం॥

మంత్రి :

ఓహో- ఏమా సందేశం, మహారాజ్! నేటినుండి- కత్తినిపట్టి కదనరంగమున కురకనని- త్రికరణ శుద్ధిగా ప్రతిజ్ఞ చేస్తున్నాను!-

అశోకుడు :

(ఆనందనేత్రాలతో- అతని వంక చూస్తూ హృదయసంతోషాన్ని పొందుతాడు.)

(బయటనుండి, సైనికులు, జయజయధ్వానాలు సలుపుతారు, నిండుచంద్రుడు ఆకాశంపైకివచ్చి తనఆనందకిరణాలను దేశం అంతటా ప్రసరిస్తాడు వెండితొడుగులు తొడిగినట్లు-ప్రక్కనున్న చెట్లుపై గువ్వలు ఏదోమాట్లాడుకుంటాయి)—

# పాపలా? నగలా?

'నీకు ఎన్ని నగలున్నాయి? అని ఎవరూ అడగరు. మీకు పిల్లలెందరు అని అంతా అడుగుతారు. మన ప్రేమరసం అందిపుచ్చుకునే వంశోద్ధారకుడు ఈ పుత్రరత్నం నీవంటికీ- మనయింటికీ గూడా అలంకారంగా భగవంతుడు మనకి అనుగ్రహించాడు.'

రచయిత:

## కంకుభట్టు

౧

అసలు నాపెళ్ళి సంబంధం నిశ్చయం అయి శుభ ముహూర్తం రహితం కాకమునుపే ఒక ముసలవ్వ వచ్చి నాతో ప్రత్యేకంగా చెప్పింది. 'మీమామగారు. వట్టి లోభి. గోచీలో ముళ్లు వేస్తాడు' అంటూ వేలుమీద వేలు తిప్పి ముళ్లు ఎలాగు వేసేదీ చూపించింది కూడాను. వాళ్ళ పెట్టుపోతల్తో మనకేంపని? అన్నాను.

దేశకాల పరిస్థితుల్ని పట్టి ఏకరాత్ర వివాహం అయింది. తరవాతకూడా ఏపండుగులికీ వారు రమ్మనాలేదు. నేను వెళ్ళనూలేదు. అంతట్లో మా మామగారు చచ్చిపోయారు. మా బావమరుదులు- అబ్బో! తండ్రిని మించిన శూరులు- లుబ్ధత్వంలో.

మా ఆవిడ నెల తప్పిందన్న తరవాత ఐదోనెలని వచ్చి మా అత్తగారు వేవిళ్ళ వెలంకాయలు పంచిపెట్టించి పువ్వులు ముడిపించి మా ఇల్లాల్ని పురిటికి తీసికెళ్లారు. ఏడోనెలని గాజుల సంబరం అయింది. నెలలు నిండేక దైవ కృపవల్ల సుఖంగా పురుడైంది. శ్రావణ శుద్ధ పంచమినాడు నాకు కుమారుడు కలిగేడు.

శ్రావణ పున్నంనాడే బారసాల, బాస్- బాగుందనుకున్నాను. మా వాడికి మా తాతమహుని పోలిక బాగా ఉందని నాకు అప్పుడే బోధపడిపోయింది. ఏమంటారా? పురిటి శుద్ధినాడు ఒక జంఝము, శ్రావణ పున్నమకి మరో జంఝమూ, అవసరం లేకుండా రెండూ ఏకంజేసి, ఒకజంఝం ఖర్చు మిగిల్చి, ఎవరికైతేనేం, బారసాలనాడే పావలా కూడదీశాడని సంతోషించాను.

ఎప్పుడు జరగవలసిన శుభం అప్పుడే జరగాలిగాని వాయిదా వెయ్యకూడదు అన్నరకంలో వాణ్ణిగనక బారసాలకి రమ్మని మా బావమరుదులు ఉత్తరం వ్రాసినా, వ్రాయకపోయినా పురిటిశుద్ధినాటికి అత్తారింటికి వెళ్లాలనే నేను సిద్ధపడ్డాను. వాళ్ళ సంగతి ఎరుగుదును గనక ఎందుకైనా మంచిదని జంఝాలూ, పంచలచాపూ- చీరా- రవికెలగుడ్డ, సిల్కుగుమాలు- అన్నీ కొనుక్కొని సూటుకేసులో పెట్టుకున్నాను. పురిటిశుద్ధినాటి ముందు తెల్లారగట్ల బయలుదేరేను.

౨

మీ రెప్పుడైనా కనిపెట్టి చూశారో లేదోగాని, శుభకార్యం తలపెట్టుకుంటే, ఆవేళకి- దాంతస్సాగొయ్యా- మనకార్యం వేళకి- ఎక్కడనుంచి వస్తుందోగాని - నక్కి- పిల్లిలాగ ఎదురుగా వస్తుంది- వెధవ వర్జ్యం. పంచాంగం చూసుకొనేసరికి- సరిగా పదిగంటలకల్లా- కాందూరి లక్ష్మీపతి లాగ- వచ్చి పడిపోతుంది- అడ్డంగా వర్జ్యం- అని స్పష్టంఅయింది. కాఫీ గత ప్రాణం అయిరి. వర్జ్యం వెళ్ళేదాకా వుంటే- గుడ్లు గూట్లోకి వస్తవి- వర్జ్యం రాకుండానే బారసాలా- నామకరణం- అన్నీ జరిగి

పోవాలని నా సంకల్పం. కనకనే తెల్లారగట్లే బయలుదేరాను. రెయిలుకారే ఎక్కాను. అయినా క్రాసింగులో అరగంట ఆలస్యం అయిపోయింది. ఏడున్నరకల్లా మా అత్తారివూరిస్టేషనులో దిగేను. మా పెద్దబావమరిది స్టేషనుకు ఎదురుగావచ్చి నన్ను రిసీవుచేసుకున్నాడు. స్టేషనుకీ,మావాళ్ళయింటికీ మధ్య మెరకపొలాలు ఉన్నవి. అందులో నాయెత్తున గంటిచేలు. రైట్- లెఫ్ట్- అని మైముమార్చ్ చేస్తున్న సోల్జర్లు చేతుల్లో నిలువుగా పటుకున్న తుపాకుల్లాగ గంటివెన్నులు పువ్వారాలతో గాలికి కదులుతూ చూడవేడుకగా ఉన్నవి. వాటిమధ్య గట్లమీదుగా వెళుతూ, మాబావా నేనూ అవూసూ- యీవూసూ- చెప్పుకుంటూ నడుస్తున్నాం.

3

అంతట్లో మాకు ఈమాటలు వినొచ్చాయి: 'ఏంటమ్మా! తల్లీ! గంగమ్మతల్లీ! ఈమధ్య చేయించుకున్నావంటా?'

ఈమాటలు విన్నాక ఈరోజుల్లో ఇంత ఓపికగా ఇలా చేయించుకున్న వారెవరు చెప్మా, ఏంవిటా చేయించుకున్నదీ, అని వితర్కిస్తూ అటూ యిటూ చూశాను. కాని గంటిచేను అడ్డంవుండడంవల్ల ఎవరో ఏమీ కనబడలేదు.

'ఆమాటాడేవా రెవరు?' అన్నాను నాబావమరదితో.

'దగ్గిరగా వెళితేగాని నాకూ తెలవదు' అన్నాడు.

'అయితే-పద' అన్నాను- నడిచాము- సరి- పొలంగట్టుదాటి వీధిలో అడుగుపెట్టాం. మా ఎదుట పాతికగజాల దూరంలో- చక్కనిచుక్క- ఒక యువతీలలామం నిలబడి ఉన్నది ప్రౌఢనిర్భర వయఃపరిపాకం లో - పాతికేళ్లు మించిన ప్రాయం. జరీ అంచు- పాలపిట్టరంగు- చీర. పండు తమలపాకు శరీరఛాయ. మందహాసంతో వెన్నెల వెదజల్లుతూ ఉన్న పూర్ణచంద్రబింబం- ఆ ముఖం మీద తనివీ- సంతోషమూ- తాండవిస్తున్నవి.

దేవేంద్రుడి దుంపతెంపి నందనవనంలో దేవపారిజాతం తవ్వించి తెప్పించి దర్జాగా తన తోటలో దింపించి పాతించినప్పుడు సత్యభామ ముఖం ఎలావుంటుందో రవి వర్మ రాయలేకపోయాడు. ఈక్షణంలో ఈవిడ ముఖంచూస్తే తప్పక వ్రాసి ఉండును. ఆకళ- ఆదర్జా- ఆ ఉల్లాసం- ఆతనివి- అబ్బబ్బా! చూసి ఆనందించవలసిందే- నా చేతిలో ఆసమయానికి కేమరా లేకపోయిందని మహా విచారించాను. ఉంటే స్నాపుషాట్ తీసి నాలుగు పత్రికలకీ పంపితే 116 లు కిట్టకపోనా? ం

లేనప్పుడు ఏంజేస్తాం? మాటల్లో చిత్రించడానికి యత్నిస్తాం కాని అట్టే ప్రయోజనం ఉండదు. ఏమంటే మాటల్లో బొమ్మల్ని జీవకళలతో రచించడం మజాకావా? అలాగ రచించే శక్తి నాకులేదు. అయినా ప్రయత్నం మానను.

ఆమె ఎదుట నిలబడ్డవాడు ఒక ముసలాడు. గొల్లవాడు. చాలా కాలంనుంచి వాళ్ళ భూములు దున్నుతూ- తోటలుకాస్తూ- గోసంరక్షణచేస్తూ- చనువుగా ఇంట్లో తిరుగుతూ- వస్తూపోతూ ఉంటాడని తెలిసింది. ముగ్గుబుట్టలాంటి తల. జనపనారలాంటి మీసం. ఒక గుమ్మంవైపు వీపుతిప్పి వీధిలో వాడు నిలబడ్డాడు. వాడికి ఎదురుగా ముప్పావుగజం దూరంలో ఆవిడె నిలబడ్డది. ద్రావిళ్ళట. రవికెలేదు. బ్లూరంగుచీర కుడిపమిటలోనుంచి ఆవిడ పెద్ద కట్టడ కాసులపేరుతీసి రెండుపక్కలా రెండు బొటనవేళ్ళతో పట్టి నిలిపి ముసలాడికి చూపిస్తున్నది. ఆపసిడి మిసమిసమీద అప్పుడే మబ్బువిడిచిన సూర్యకాంతి పడి కళ్లు జిగేల్ మన్నవి. ఆవేళ పట్టపగలే ఉదయించిన పున్నపు చంద్రుడా ఏంవిటి అన్నట్టున్న ఆవిడె ముఖవికాసమూ, ఆదిగువ కంఠంచుట్టూ ఉన్న కాసులపేరూ చూస్తే, నాకు

'పరివేషముగల చంద్రుని
పరివేషముదాల్చె మొగము జగము
నుతింపన్.'

అన్న నాచనసోముని పద్యం చటుక్కున జ్ఞాపకం వొచ్చింది. చంద్రుడు గుడికట్టేడంటే దానికీ, దీనికీ

ఒక్క భేదంవుంది సుమండీ- చెప్పవద్దా? మరి? ఇక్కడ ఈమె ముఖచంద్రుడిచుట్టూవున్న కాసులపేరు చక్రంలాగ గుండ్రంగాలేదు. గొళ్ళెంలాగ పొడుగుసాగివుంది.

మెడలోంచి పమిటమీదుగా తీసి కాసులపేరు వొయ్యారంగా పట్టుకొని నిర్భరహర్షంతో చూపిస్తూ ఉన్నది- మన ఆంధ్రసోదరి. 'ఆహా-హా-హా-హా-' అంటూ ఆనందాశ్చర్యాలతో చూస్తున్నాడు గొల్లవాడు. ఉభయులూ తన్మయులైపోయి, దారికడ్డంగా చిత్రప్రతిమల్లాగ అట్టే నిలబడిపోయారు. వాళ్లు పొందుతూఉన్న అనిర్వాచ్యమైన ఆనందం- అత్తరువు వాసనలాగ- మాదాకాకూడా కొంత వ్యాపించింది- హాయిమని కొంతసేపు మేమూ బొమ్మల్లాగ నిలబడిపోయాం. సుఖమైనా, దుఃఖమైనా చుట్టుపక్కల వాళ్ళనికూడా చలింపచేస్తవి; కాని మానవు.

౪

రైలు ఆలస్యంఅయింది- అవతల వర్జ్యం వస్తూందని నాకు ఎంతతొందరగా ఉన్నప్పటికీ- ఇరుకువీధికి సరిపడా- ఇటూఅటూ నిలబడి- తనివితీరా కాసులపేరు చూపిస్తూ ఆవిడా- చూస్తూవాడూ- పొందుతున్న సంతోషప్రవంతికిఅడ్డంగా పోవడం సుతరామూ నాకు ఇష్టంలేకపోయింది- కొనకి, తెగించి 'బావా? పక్కవీధుల్లోంచి మాయింటికి దారిలేదుటోయ్- పాపం వీళ్ళని ఎందుకు డిస్టర్బు చెయ్యడం? మనం చుట్టుతిరిగి పోదాం' అన్నాను. సరే-పద అని అతను తూర్పుకి మళ్ళేడు. నేను వెంబడించాను. మామాటలు వాళ్ళకి వినపడ్డట్టేలేదు. అవతల శ్రావణవర్షాజినాలకోసం బయలుదేరి- నవోనవో భవతి జాయమానోన్నహా- భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవ' మొదటి వేదపన్నాలు సస్వరంగా చదువుకుంటూవచ్చిన వైదికబృందంకూడా వీళ్ళనిచూసి, తోసుకెళ్ళలేక మరోవీధికి మళ్ళిపోయారు.

వాళ్ళిద్దరూ అలా అక్కడ ఎంతసేపుఉండి పోయారో? ఏమో!

౫

నాలుగడుగులు నడిచాక ఆమెయెవరు, ఏమిటని సంగతంతా మా బావమరిది నడిగి తెలుసుకున్నాను.

వాళ్ళ ఇంటిపేరు ఏదోచెప్పాడు. నేను నోటుచేసుకోలేదు. ఆవిడపేరు గంగమ్మగారు. వాళ్ళనాయనమ్మ గంగాపుష్పరాలకి వెళ్ళివచ్చిన తరవాత ఆవిడపుట్టిందట. అందుచేత ఆవిడకి వాళ్లు వాళ్లు గంగాభవానిపేరే పెట్టారట.

ఆవిడ పుట్టింటివారు మంచి భాగ్యవంతులట. ఒక్కర్తే కూతురు.

ఆమెభర్త ఐదుగురు అన్నదమ్ములలో మధ్యవాడు. అగ్నిహోత్రంలాంటి కుటుంబం. ఆవిడ సుశీల. భూమీ బుట్రా, తోటా-దొడ్డీ అన్నీవున్నవి - వేలకొద్దీ రాబడిఉంది. అయితే పాపం-

'సకలసంపద లిచ్చీ, సౌభాగ్యములనిచ్చీ సంతానమీడామె సర్వేశ్వరుండూ' అన్నట్టుగా గర్భవాసపు పంటలేదు.

కాలంతో వృద్ధిఅవుతూ సంతానంమీద ప్రసరిస్తూ ఉండవలసిన ఆమె ప్రేమవాహిని నంతా నాభావంలో సరుకూ, చప్పరా, మీదికి మళ్ళింది. తినడానికి ఇక ఎవరున్నారు? ఉన్నదిఎలా ఖర్చుకావాలె ? ప్రతిశ్రావణమాసంలో పున్నంముందర శుక్రవారంనాడు లక్ష్మీపూజవేళకి ఆవిడ ఒక కొత్తవస్తువచేయించి పెట్టుకుంటూ ఉంటుంది. ఈయేడు పదిహేనువందల రుపాయిలకుపైగా ఖర్చుపెట్టి గంగమ్మగారు ఆషాడమాసం నెల్లాళ్లూ రాత్రిపగలుకూడా మొగుణ్ణి కంసాలి దుకాణంమీద కాపుకూచోబెట్టి విసుపులేకుండా అదేపనిగా చేయించుకున్నది- ఈ కట్టడ కాసులపేరే-

గంటిచేలో మా చెవుల పడ్డ మాటలకి ఇప్పుడు మీకు అర్థం బోధపడిందా? బంగారంమీద తనివి- తీరగా- మిగిలినది- 'సవిశేషః' అన్నట్టు- గంగమ్మగారు పిల్లుల్ని పెంచడంలో వినియోగిస్తున్నారట!

భగవంతుడు అనుగ్రహించిన

వాత్సల్యమును అందిపుచ్చుకోనే టందుకు సంతానం కలకలపోయి నప్పుడు ఆవాత్సల్యం నగలమీదకీ, పిల్లులమీదికీ పరిగెత్తుతూ ఉంటుంది.

౬

మేము చుట్టుతిరిగి రావడం కొంత ఆలస్యం అయినప్పటికీ— ఆసరికే- ఇంట్లో వెదురాకూ- వావిలాకూ- వేసి కాచిన వేడినీళ్ళతోనూ. ఇరుగు పొరుగూ ఇళ్ళవాళ్ళు అభిమానంతో కాచి పంపినబిందెలలో వేడినీళ్ళతోనూ, మాఆవిడె పురిటిస్నానంచేసింది- ఇంతలో నేనూ వెళ్లాను.

ఇంట్లోవాళ్ళు- ఇరుగువాళ్ళు- పొరుగువాళ్ళుఅంతా 'సీతమ్మ మొగుడొచ్చాడు- సీతమ్మమొగుడొచ్చాడు' అని ఆరంభించారు నాకు కోపమూ- నవ్వుకూడావచ్చాయి- ఇదేమిటి- నాఊరూ-ఇంటిపేరూ- పేరుపోయి నా పెళ్ళాం మొగుడిపేరు వచ్చిందిఅని కోపంవచ్చింది. కాని- 'నీపెళ్లాం, మొగడా' అంటారు- ఇందుకే కాబోలునని- గెజిట్‌లో పడకుండా పేరుమారి పోయినందుకు నవ్వుకున్నాను- అయిన- హనుమంతుడి బ్రహ్మస్త్రబంధంలాగ, ఇదెంత సేపో వుండదు- మావూరు వెళ్లితే నాయెప్పటిపేరు వచ్చేస్తుందనుకున్నాను.

వర్జ్యంరాకముందే పీటలమీద కూర్చున్నాం. మాశావలుమాత్రం సమయానికి ఎక్కడికో 'దాటేశారు', నేను జంఝం పంచల చాపూ, చీర- పిల్లాడికో పట్టు రుమాలు తెచ్చుకోడం మంచిపనే చేశాననుకున్నాను. ఆజంఝాలు వేసుకుని, కొత్తబట్టలు కట్టుకుని మాతండ్రిగారిపేరే మాపిల్లవాడికి నామకరణం చేశాము. నేనేదీ కొత్తగా వస్తువ చేయించి పెట్టలేదని మా ఆవిడ గునిసింది. కాని నేను ఇలాగ నచ్చచెప్పాను-

'జాగరాల గవిరమ్మలాగ నంటినిండా నగలు దిగేసుకుని- పొడి అయినాలేని ఇస్త్రోకురాణీలాగ- నగలు చూసుకుంటూ పొంగడమా? జన్మకి సాఫల్యం? నీకు ఎన్ని నగలున్నాయి? అని ఎవరూ అడగరు? మీకు పిల్లలెందరు అని అంతా అడుగుతారు. మన ప్రేమరసం అందిపుచ్చుకునే వంశోద్ధారకుడు- ఈపుత్రరత్నం నీవంటికీ- మన యింటికీ కూడా అలంకారంగా భగవంతుడు మనకి అనుగ్రహించాడు. ఆభగవంతుడికి నమస్కారంచేసి, ఈశిశువుకి ఆయురారోగ్యాలు ప్రసాదించమని వేడుకుందాం. ఈ చిరంజీవిని- ఈకులదీపకుణ్ణి చూసి మురుస్తూఉండు.' అంటూ నా వేలిఉంగరంతీసి ఉగ్గుగిన్నెలోవున్న పాలు పంచదారల్లో ముంచి తీసి కుదిపితే వాడు చిన్నపెదిమెలతో ఆ అమృతం చప్పరించాడు. మాకు అపరిమితానందం- చెప్పరాని తనివీ- సౌఖ్యమూ కలిగినవి- 'దీర్ఘాయుష్మాన్ భవ' అన్నాను. పెద్దలూ. ముత్తైదువులూ అంతా 'తథాస్తూ' అంటూ అక్షింతలు జల్లేరు- మంగళహారతులు పాడేరు.

*    *    *

ఎంతడబ్బు ఉంటేనేం? ఎన్ని నగలు ఉంటేనేం? ఎంత ఐశ్వర్యం ఉంటేనేం? ఎన్ని ఫేషన్లు ఉంటేనేం- పిల్లలులేక ఫ్రాన్సు పడిపోయింది. పిల్లలతోసాటా? అన్నారు ప్రేక్షకులలో ఒకరు.

---

# నిజము!

పన్యాల
వేంకటరంగనాథరావు.

కట్టుకొన్నా నొకానొకక్షణములోన,
నిండుహృదయాన ఆశలునింపుకొని, మ
నోహరమ్మగు సౌధమెంతో ప్రియాన.
కాని, ఆసౌధ మొక శూన్యమైనచోట
కూలిపోవునటంచు, నీవేల నాకు
ముందుగా చెప్పితివి కావో!

ముక్కోనో
కప్పుడనుకొంటి, నాకు నిరాశలేద
టంచు నవివేకినై; కాని, అనుభవమ్మ
నాకు కల్పించి, నేర్పించినావు, నేడు
నాబ్రతుకులో నిరాశతాండవ చేయు
నంచు మొదలంట......

నిజముదేవా! నిజమ్మ,
నిజము- ముమ్మాటికి నిజమ్ము- నిజముదేవ!

# కళ్లేపల్లి తిరుణాళ్ళ

కళ్లేపల్లి తిరుణాళ్ళను పురస్కరించుకుని ఈవ్యాసంలో హాస్యోద్దీపనం కోసం వ్యాసకర్త క్రోడీకరించిన ఘట్టాలన్నీ ఇతర తిరుణాళ్ళకున్ను చెందుతాయి. మనతీర్థాలు వాటి అంతర్యాన్ని కోలుపోయి అవినీతికి ఆస్కారాలై వున్నాయి. అవి సంస్కరణాన్ని కోరుతున్నాయి. ఇట్టి వ్యాసాలు అట్టిపనిని కొంతవరకు చేయగలవు. —సంపాదకుడు.

రచయిత:

## అలంపురం రాజు, బి. యే.

నాకు అందంగా వ్యాసం వ్రాయడం చేతకాదు. ఇదివరలో న్యూస్ పేపరు రిపోర్టరుగా ఉండేవాడ్ని. ఏదోవిధంగా తనుపేర్లు పేపర్లో పడితే అందలం ఎక్కినట్లు అఘోరించే సన్యాసులు బ్రతిమాలితే మొగమాటాన్ని వాళ్లు దేశనాయకుల్లాగ పనిచేస్తున్నారని వ్రాశాను. నిజానికి వాళ్ళు విగ్రహాల్లాగ కూర్చున్నచోటునుంచి కదలనిరకం. ఇది సంపాదకునకు తెలిసిన మర్నాడు నాఉద్యోగం మన్నగలసింది. బుద్ధి తెచ్చుకుని ఈ తిరణాల విశేషాలు ఉన్నవున్నట్టు వ్రాస్తున్నాను. ఏసంపాదకుడయినా నాలో 'మెరిట్' గ్రహించకపోతాడా అని.

* * *

పతివ్రతలకు అత్తారింటికి వెళ్ళటం సరదా. బహుపతివ్రతలకు–అంటే అనేకమంది పతులకు సహాయపడవలెననే వ్రతంకలవాళ్ళకు పుట్టింటికయితే సరదా. ఈరెంటినిమించిన సరదా వెధవముండలకి తిరుణాలంటేను.

సంతనాడు మిఠాయివాడి చేతిలో జీళ్ళపాకం ఎలాసాగుతుందో శివరాత్రికి కళ్ళేపల్లి తిరుణాలు అలాసాగుత్తాయి. ఇంకా ఎన్నో జనసామాన్యాన్ని ఆకర్షిస్తాయి.

* * *

తిరుణాలకొచ్చినవాళ్ళలో మగవాళ్ళు 3 పాళ్ళు, ఆడవాళ్ళు 5 పాళ్ళు: ఆడాళ్ళలో కురిడీసరుకు 12 పాళ్లు, మిగతాసరుకు 4 పాళ్లు.

తమభర్తలుకూడా ఉండి సాయండున్నారని సంతోషించినవాళ్ళు 2 పాళ్లు, తమస్వాతంత్రానికి అడ్డుకలుగజేశారని పరితపించినవాళ్ళు 10 పాళ్ళు.

ఆడవాళ్ళు ఖర్చుపెట్టిన డబ్బులో భర్తలిచ్చినది 2 పాళ్ళు, పైవాళ్ళిచ్చింది 10 పాళ్ళు, అత్తకు తెలియకుండా బియ్యం అమ్ముకుని ప్రోగుచేసుకున్నది 6 పాళ్ళు.

సముద్రం పోటుమీద ఉన్న మూలాన్ని స్నానోదకంలో కృష్ణజలం 1 పాలు, సముద్రజలం 6 పాళ్ళు. స్నానంచెయ్యడంవల్ల పోయిన పాపం 3 పాళ్ళు–ఒంటికంటుకున్న ఉప్పు 5 పాళ్ళు, బురద 15 పాళ్ళు

స్నానంచేశేటప్పుడు తూర్పు దిక్కుకుతిరిగి మునిగినవాళ్ళు 3 పాళ్ళు, అందమైన ఆడవాళ్ళవంక తిరిగి మునిగినవాళ్ళు 6 పాళ్ళు.

నీటికాసులట్టిన బ్రాహ్మల్లో మంత్రాలు చదువుకున్నవాళ్లు 13 పాళ్ళు, బియ్యే చదుపుకున్నవాళ్ళు 2 పాళ్ళు, కమ్మ బ్రాహ్మాలు వగైరా 1 పాలు.

స్కూలు కుర్రాళ్ళలో స్నానం చేద్దామని వచ్చినవాళ్ళు 2 పాళ్ళు. పలుచని చీరకట్టుకుని స్నానంచేసే పడుచు పిల్లల శరీరసౌందర్యం చూద్దామని వచ్చినవాళ్లు 14 పాళ్లు.

దుకాణాల్లో అమ్మిన మిఠాయి తాజాసరుకు 5 పాళ్లు, బందరు తిరణాల్లో మిగిలింది 7 పాళ్ళు, నిరుటి శివరాత్రిది 4 పాళ్ళు. మిఠాయి సరుకులో బెల్లం 9 పాళ్ళు, శనగపిండి 3 పాళ్ళు, చీమలు 1 న్నర పాలు, బూజు 1 పాలు.

కాఫీ డికాక్షనుకు ఉపయోగించింది గింజలపొడి 3 పాళ్ళు, డబ్బాపొడి 8 పాళ్ళు, రోడ్డుబూడిద 5 పాళ్ళు.

గర్భగుళ్ళోకి పళ్ళట్టుకెళ్ళే ఆ డాళ్ళకు ముందు తోపులు 3 పాళ్లు, వెనుకతోపులు 7 పాళ్ళు, ప్రక్క తోపులు 10 పాళ్ళు.

* * *

తిరణాల్లో ప్రజలు అనేక విషయాల్ని గురించి అనేక విధాలుగా మాట్లాడుకున్నారు. వాట్లో కొన్ని పొందుపరుస్తాను.

ఒకడు—శివరాత్రి అని ఎందుకంటారురా ?

మరొకడు—గౌరీశంకరుల గర్భాదానంరాత్రి గనుక!

ఒకడు—నీ కెలా తెలుసు ?

మరొకడు—సీతారాములు ఒకరి ప్రక్క నొకరుంటారు. అది పట్టాభిషేకం. గౌరిమీద శివలింగం ఉంటుంది. ఇది గర్భాదానం.

ఒకడు— శివరాత్రికి రాత్రివేళ నిద్రపోగూడదంటా రెంచేత?

మరొకడు—వాళ్ళిద్దరూ ఆగర్భాదానంనాడు నిద్రపోలేదట.

* * *

కొడుకు—నాన్నా, మాంమాష్టరు గారు స్త్రీలింగం పుల్లింగం మాట చెప్పారుగాని శివలింగం మాట చెప్పలేదే?

తండ్రి—ఇది ఆరకం లింగంకాదు

* * *

ఒకడు—ఒంటరిగా ఎక్కడి కెడతావమ్మా?

ఒకతె—మా ఊరోళ్ళున్నచోటికి.

ఒకడు— మీ ఊరోళ్ళున్నారుగాని మీఆయన లేడన్నమాట. రాత్రి యిద్దరం కబుర్లు చెప్పుకుం టూ జాగారంచేద్దామా?

ఒకతె—ఎదవ చచ్చినోడ !

* * *

ఒకడు—బందరులో లవకుశ టాకీ చూశావురా?

మరొకడు—లవకుశ చూడలేదు కాని కుశలవ చూశాను. మా వూళ్లో నాటకంయేశారు.

ఒకడు—అసలు ఏదయినా సినీమాచూచావా?

మరొకడు—చూడకేం? మొన్న నే ద్రౌర్ల చీనీమా చూచాను. అందులో ఆడోరసానుల ఆ ఒళ్ళు-ఆకళ్ళు-ఆపళ్ళు- చూ స్తే- అబ్బ- లేచి నుంచునీదిరా ప్రతీయెంటికీని.'

* * *

ఒకడు—రాత్రి శ్రీకృష్ణ రాయబారం నాటకానికొస్తావా. బందరాళ్ళు వేస్తున్నారు.

మరొకడు—మొన్న సు శాత్తుల్లుగారు బాగోతంచెబుతూంటే విన్నాను. ఉంచుకోటానికి 4 గురు గోపికల్ని యిమ్మని కుట్టమూర్తిని నారదుడు అడిగాడంట. ఆగోపికలకీ నారదుడికీ ఏమయినా రాయబారం చేశాడేంటి కుట్టమూర్తి?

* * *

ఒకావిడ ఉపవాసండుండి అన్నం మెతుకు ముట్టకుండా సాయంత్రం వేళ సవాసేరు మిఠాయి, ఒక అరటిపళ్ళ త్తం, యింటినుండి తెచ్చిన రెండు చిమ్మిలుండలు, అర్థణా వేరుశనక్కాయలు తిని చెంబుడునీళ్ళు త్రాగింది. రాత్రి జాగారంచేశింది. తెల్లారేసరికి అజీర్తివిరేచనాలు లకించుకున్నాయి. దానితోపాటు రెండు వాంతులయినయ్.

కలరాఅంటే కలరా అన్నారు. ఆవెడ స్పృహతప్పి పడిపోయింది. ఆమె బంధువులెవళ్ళూ లేరు. ఇరుగు పొరుగువాళ్ళతో వచ్చింది. వాళ్ళు మిగతా వాళ్ళతోపాటు భయపడి తోకముడిచి యింటికి త్రోవతీశారు. అంతా చూచాను. బలే సమయం అనుకున్నాను. గభాలున ఆవెడమీద వాలేను.

'అయ్ నాపెళ్లామో ! అయ్ నాపెళ్లామా ! ఎంతపనిచేశావే!' అంటూ ఆవిడ్ని కౌగలించుకుని ఏడవటం మొదలెట్టాను. కాస్సేపేడ్చి, మెడలోఉన్న కాసులపేరు, చెవులదుద్దులు, చేతిగాజులుతీసుకుని జేబులో వేశాను.

రవిక జేబులో ఏమన్నా డబ్బుంటుందేమోనని తడిమాను. గుండె కొట్టుకొంటున్నట్టు గోచరించింది. నాగుండె లటుక్కుమంది. దొరికిపోయాననినాకునిజంగాఏడ్పువచ్చింది.

గభాలునలేచి 'కలరావచ్చిందని ఎవరూ దగ్గరకురారంటే, ఎంతగతిపట్టిందే, బండిలోలుకొస్తానే, మీఅమ్మదగ్గరకు తీసుకెడతానే అయ్ నాపెళ్లామో ! అయ్ నా పెళ్లామా!' అంటూ ఏడుస్తూ యివతలికొచ్చాను. ఆరావడం రావడం బందరొచ్చేవరకు వెనక్కితిరిగి చూడలేదు.

# జిందగి

రాయీ రప్పా,
చుట్టూ నీరూ,
నీటిలో నాచూ,
నాచులో నిప్పూ,
నిప్పులో నేనూ,
నాచులో నేనూ,
చుట్టూ రాళ్ళూ,
కాళ్ళలో ముళ్ళూ,
ముళ్ళలో తేళ్ళూ!
దారిపొడుగునా
దారిద్ర్యం
దౌర్భాగ్యం!
ఆకలితో
ఓపికతో
చిచ్చులనీ,
చీల్చుకనీ
ఒంటరిగా
గబగబా
పోతాన్ పోతాన్ నా
పైపైకి!
పన్నీటి కోనేరు
నడమన గుడీ,
గుడిలో ప్రేయసి,
చుట్టూ నావలు,
నవ్వుల నావలు,
కోనేటి కావల తోటా,
తేనెల తోటా!
తోటలో వెన్నెల,
వెన్నెల పిట్టలు,
పిట్టల పాటలు
వలపుల ఊటలు,
నావలో నేనూ,
గుడిలో నువ్వూ,
తేనెల ఊటలో
ఊయల లూగుతూ,—
నవ్వుల రథంలో
నాట్యం చేస్తూ...
జీవన పథంలో
ఝోరుగ పోదాం?
ఆడ్తూ
పాడ్తూ
ఆనందంతో!

—కన్నీటి కలం.

# ఆత్మతత్వం : పరబ్రహ్మం.

అర్జునుడు :

అన్నలున్నా రచ్చట
నా తమ్ములున్నా రచ్చట
మామలున్నా రచ్చట
నామనుమలున్నా రచ్చట
బావలున్నా రచ్చట
నామరదులున్నా రచ్చట
అమూల్యంబగు అస్త్రవిద్యను
సమూలముగా నేర్చినట్టి
గురువులున్నా రచ్చట
గురు పుత్రులున్నా రచ్చట
దీప్తిమంతులు దివ్యమూర్తులు
తాతలున్నా రచ్చట
పూజగొనగల పూతచరితులు
తండ్రులున్నా రచ్చట
చాపమెత్తి శరముద్రుంచే [వా!
శరములను నేగురియజాలను, బా
ఆత్మబంధుల రక్తవాహిని
ఉరకవేయుచు పరువులెత్తగ [వా!
కంటితోనే చూడలేనోయ్, బా
ఒడలుగడగడ వడకుచున్నది
శిరముభూమికి క్రుంగుచున్నది
కంపమొందే కరమునుండీ
గాండీవము జారుచున్నది-
గద్గదంబగు కంఠమందున
దేవదత్తం పలుకకున్నది
రక్తబంధుల శవసమూహం
భావముల బాధించుచున్నది
అడవిలోపల ఆకలమ్ముల
ఆహరించుచు జీవితములో
పండువెన్నెల నిండుయావన
పున్నముల నానందముగ నా
హ్లాదముగనే గడపివైచితి
ముసలితనమున ముష్టిరాజ్యం
మాంసమ్ము టెమ్ముల గుట్టదాటి
రక్తవాహిని కవలనున్నది [వా!
ఈ విగ్గెకొన మనకదేలను ? బా
రాజఋషినై జీవితాంతం
తపముజేయుచు జపముజేయుచు
భిక్షగైకొని కుక్షినింపుచు [వా!
శాంతియుతముగ గడపివైచెద, బా

కృష్ణుడు :

విషమసమయమునందు నీకీ
విషాదం బెటుగలిగెనోయీ
సందిగ్ధసమయమునందు నీకీ
చిత్తచాంచల్యం బిదేమిటి
కత్తివ్రేటుల ఈటెపోటుల
బాణతూణీరముల బ్రతికే
వీరక్షత్రియకుమారకులకు
మాననీయంబైన యీయని
మనోవైకల్యం బిదేమిటి
గాలిలేని తుపాను రేగెను
మబ్బులేని పిడుగుపడినది
పార్థమనమూ పిరికిపడినది
విచిత్రమ్మోయి, బావా!
శోకింప గూడనివారికై
శోకించుచున్నావోయి నీవు
చచ్చిపోయినవారికై
యిక చావబోయ్యేడు వారికై
శోకింపనే శోకింపదోయీ
తత్వమెరిగిన జ్ఞానవేత్త
చంపునది కాదోయి నీవు
చంపబడునది కాదు వారు
శరములను ఛేదింపజాలని
శిరములను నీవు ద్రుంపజాలని
అగ్నిదేవుడు కాల్పజాలని
వరుణదేవుడు ముంపజాలని
వాయుదేవుడు కదుపజాలని
మృత్యుదేవుడు మెదుపజాలని
నిత్యమైనది, సత్యమైనది,
ఆదిమధ్యాంతములు లేనిది
నీవునేనై వారలై యున్నది
తనకు రెండవ దంచు లేనిది
ఒక్కటైనది ఆత్మతత్వం
వెలుగుచున్నది, బావా!

అర్జునుడు :

తొలిప్రాయమందలి తళతళలతో
మధ్యప్రాయపు మిలమిలలతో
వయసుమళ్ళిన పావనతతో
మధుర మానవ జీవవాహిని
పొంగి పొరలుచునున్నది [న్నది
మనకనులముందర చెంగలించుచు
అగ్నిగురిసీ ఎండగాసీ
జీవరహితం జేసివేయగ
ప్రాణమొప్పదు, బావా!
ఈరణమ్మే జేయలేనోయ్, బావా

కృష్ణుడు :

ముద్దుముద్దుల బాల్యమందున
ఉబికిపోయే వయసునందున
వడిలిపోయిన ముదిమినందున
వికారములను బొందకున్నది
వీటినన్నిటి జూచుచున్నది
ఒక్కటై నీలోన నున్నది
నేను నే నను అహంకారపు
అచ్ఛాదన నణగియున్నది
మహద్బ్రహ్మం బావా
చేతమున చింతింపరానిది
బుద్ధిబలమున బట్టరానిది
ప్రకృతిలో వ్యక్తమ్ముగానిది
పరబ్రహ్మం, బావా!
పట్టుబట్టీ తెలిసికొన్న
నీవునేనూ, వారు అదియే, బావా!

—కోరుకొండ సత్యనారాయణ, బి.ఎల్.

Printed at the Andhrabhumi Printing Works, 36 Mukatal Street. Vepery P.O, Madras.